Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు · స్థాపితం: 1930 · జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 82 • సంచిక: 49 • 30-11-2012 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





## వివేకా క్షేమం!

నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి అనారోగ్యంతో హైదరాబాదులోని ఒక కార్పొరేట్ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. ఆయనకు మోకాలి కీలులో సమస్య వుంది. ప్రోస్టేట్ గ్లాండ్ వాపు రుగ్మత వుంది. శ్వాసకోశ ఇబ్బందులున్నాయి. మొదటి రెండు సమస్యలకు శస్త్ర చికిత్స అవసరమై డాక్టర్లు చాలాకాలం క్రితమే చెప్పారు. కానీ ఇంజెక్షన్ సూదిని చూస్తేనే వణికిపోతాడు వివేకా. చిన్నప్పటి నుంచి ఆ భయం ఆయన్ను వెన్నంటే

కొరవ 14వ పేజీలో

### ● తెలంగాణలో

# సం'కుల'సమరం

రేపటి ఎన్నికలలో అధికారం ఎవరిదో నిర్ణయించే కీలకంగా తెలంగాణ ప్రాంతం నిలవడంతో అక్కడి రాజకీయ వాతావరణం సెగలు పొగలుగా మారుతున్నది. తెలంగాణ ఉద్యమాన్ని సమర్ధించే కాంగ్రెస్ ఎమ్పీ జి.వివేక్ తన వి6 టీవీ ఛానల్ ద్వారా ఒక సర్వే జరిపించారట. అందులో వారికి బాధ కల్గించే విషయాలు వెల్లడైనాయి. ఆంధ్ర, రాయలసీమ ప్రాంతంలో వైఎస్‌జగన్ కనీసం 130 స్థానాల వరకు గెలుచుకొనే పరిస్థితి వుందని, తెలంగాణలో కూడా ఆ పార్టీకి 40 వరకు స్థానాలు వచ్చే అవకాశం వుందని సర్వేలో తేలిందట. ఆ నివేదిక చూసిన కెసిఆర్‌కు ఎక్కడలేని భయం పట్టుకొన్నది. తెలంగాణ ప్రాంతంలోని 119 స్థానాలలో తన పార్టీ కనీసం 100 స్థానాలు గెలుచుకోవాలన్నది ఆయన లక్ష్యం. ఆ స్థాయిలో సీట్లు వస్తేనే ఆటు కేంద్రంలో కానీ, ఇటు రాష్ట్రంలో కానీ రేపు రాబోయే ప్రభుత్వాలు తన దయాదాక్షిణ్యాల మీద నడిచే పరిస్థితి ఏర్పడుతుందని, ఆ అవకాశాన్ని వాడుకొని తెలంగాణ లక్ష్యం సాధించుకోవచ్చునని ఆయన వ్యూహాలు రచిస్తున్నాడు. అయితే తెలంగాణలో జగన్‌కు 40 స్థానాలు వస్తే అంతా

కొరవ 14వ పేజీలో

## జగన్‌తో కాంగ్రెస్ రాజీ?

వైఎస్ జగన్‌కు జైలు నుంచి విముక్తి కల్పించాలని ఢిల్లీలోని కొందరు కాంగ్రెస్ పెద్దలు ప్రయత్నిస్తున్నట్లు వినికిడి. రేపటి ఎన్నికలలో రాష్ట్రంలో కాంగ్రెస్ ఒక్క ఎమ్పీని కూడా గెలిపించుకోలేని హీన స్థితికి దిగజారిపోయిందని నివేదికలు, సర్వేలు సూచించడంతో ఆందోళనకు గురౌతున్న కాంగ్రెస్ నేతలు, ఎట్లయినా జగన్‌ను మచ్చిక చేసుకోవడానికి పాచికలు విసురుతున్నారని చెప్తున్నారు. గతంలో కూడా కాంగ్రెస్ అధిష్టానం ఈ ప్రయత్నం చేసింది. సుప్రీంకోర్టులో జగన్ బెయిల్ పిటిషన్ విచారణకు చివరి నిముషంలో సిబిఐ న్యాయవాదిని మార్చి సహకారం అందజేశారు. కానీ

కొరవ 14వ పేజీలో

# ఎందుకంత పట్టుదల?

రిటైల్ రంగంలో, బీమా కంపెనీలలో విదేశీ పెట్టుబడులను అనుమతించే విషయంలో మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం చాలా పట్టుదలకు పోతున్నది. ఎట్టి పరిస్థితులలోనూ ఈ విధాన నిర్ణయాన్ని అమలు చేసి తీరాలని పట్టుబడుతున్నది. భారతదేశంలో ఇప్పుడున్న ఆర్థిక స్తంభన పరిస్థితి తొలగించాలంటే విదేశీ పెట్టుబడులే శరణ్యమని, అందుకు చిల్లర అంగళ్లను తెల్లదొరలకు అప్పచెప్పడమే మార్గమని ప్రధాని భావిస్తున్నాడు. తాను అమలు చేస్తున్న ఆర్థిక సంస్కరణలలో ఇది అత్యంత ప్రాధాన్యత కల్గిన అంశమని వాదిస్తున్నాడు.

అయితే ప్రతిపక్షాలు కూడా అంతే పట్టుదల చూపుతున్నాయి. రిటైల్ రంగంలో విదేశీ పెట్టుబడులు కోటి మంది చిల్ల వర్తకులు, వాటిపై ఆధారపడి బ్రతికే చిరుద్యోగులకు మరణ శాసనమన్నది వారి వాదన. ఈ విషయంలో బిజెపితో పాటు ములాయంసింగ్, కరుణానిధి, చంద్రబాబు, మాయావతి, జయలలిత, మమతా బెనర్జీ వంటి ప్రాంతీయ పార్టీల నేతలు కూడా ఈ విధానాన్ని గట్టిగా ప్రతిఘటిస్తున్నారు. దానితో లోక్‌సభలో గత నాలుగు రోజులుగా ప్రతిష్టంభన నెలకొని వుంది. ఈ విధానం అమలుపై లోక్‌సభలో చర్చతోపాటు ఓటింగ్ కూడా జరపాలన్నది ప్రతిపక్షాల కోరిక. తమకు బయట నుంచి మద్దతు ఇస్తున్న ములాయం, మాయావతి పక్కకు తప్పుకొంటే ప్రభుత్వమే కూలి పోతుందన్నది మన్మోహన్ సింగ్ భయం. దానితో ఆయన బిజెపిని ఎంతగానో ప్రాధేయపడుతున్నాడు. ఓటింగ్ వద్దని విజ్ఞప్తి చేస్తున్నాడు. విందు సమావేశాలు పెట్టి విడివిడిగా ఒక్కొక్కరినీ గడ్డం పట్టుకొని బ్రతిమలాడుతున్నాడు. కానీ ఒక్క కరుణానిధి తప్ప ఎవరూ ఆయన దారిలోకి రావడం లేదు.

ప్రధానికి ఎందుకంత పట్టుదల అన్నది ప్రశ్న. రిటైల్ రంగంలో విదేశీ పెట్టుబడుల మీద ప్రజలలో చాలా అనుమానాలున్నాయి. దానివల్ల వ్యవసాయ రంగంలో సాంప్రదాయకత కనుమరుగై పోతుంది. అధిక ఉత్పత్తి పేరుతో జన్యు మార్పిడి విత్తనాలు ప్రవేశిస్తాయి. వాటికి పెట్టుబడి అధికం. ఏ కారణం వల్లనైనా పంట నష్టం జరిగితే రైతు కోలుకోవడం దుర్లభం. మరొకప్రక్క పంటకు గిట్టుబాటు ధర హామీ ఏదీ లేదు. వ్యవసాయం ఒక జూదంగా మారుతుంది. మరొకప్రక్క పరిశ్రమల రంగం తీవ్రమైన సంక్షోభానికి గురౌతుంది. చవకగా దొరికే చైనా దేశపు వస్తువులు మన మార్కెట్‌ను ముంచెత్తుతాయి. వారితో పోటీ పడడం మన పరిశ్రమలకు అసాధ్యం. చైనాలో పరిశ్రమలకు ప్రభుత్వ మద్దతు వుంటుంది. ఇక్కడ ప్రభుత్వ ఒత్తిడి వుంటుంది. మన వడ్డీ రేటు ఎక్కువ, కరెంట్ చార్జీ ఎక్కువ, కరెంట్ సరఫరా సరిగా వుండదు. రకరకాల పన్నుల భారం మరొకప్రక్క పరిశ్రమలను కుంగదీస్తున్నది. ఇది చాలక అధికారుల అవినీతి, అందుకోసం దాడులు, ఒత్తిడులు. ఈ సమస్యల మధ్య మన పరిశ్రమలు చైనాతో పోటీ పడి వస్తువులను తక్కువ ధరలకు ఉత్పత్తి చేయడం జరిగే పని కాదు. దానితో కోట్లాది మందికి జీవనోపాధి కల్పిస్తున్న చిన్న పరిశ్రమల రంగం కుప్ప కూలిపోయే ప్రమాదం వుంది.

జమీన్‌రైతు

ప్రజల జీవనానికి సంబంధించిన మౌలిక ప్రశ్నలను రేకెత్తిస్తున్న విధాన నిర్ణయాన్ని, ప్రజాభిమతానికి విరుద్ధంగా అమలు చేసి తీరాలని కేంద్ర ప్రభుత్వం పట్టుబట్టడం విచారకరం. సాధారణ ప్రజలు, ప్రతిపక్షాలే కాదు, నోబెల్ బహుమతి గ్రహీతలైన ప్రపంచస్థాయి ఆర్థికవేత్తలు కూడా రిటైల్ రంగంలో విదేశీ పెట్టుబడుల పట్ల అభ్యంతరాలు వ్యక్తం చేస్తున్నారు. అమెరికా వాసి జోసెఫ్ స్టిగ్లిజ్ దీనిపై ఒక ప్రకటన కూడా చేశాడు. భారతదేశంలో ఈ విధాన నిర్ణయం వల్ల మధ్యతరగతి, పేద ప్రజల జీవన ప్రమాణాలు మరింతగా పతనమై పోతాయని హెచ్చరించారాయన. జోసెఫ్ స్టిగ్లిజ్, నోబెల్ బహుమతి గ్రహీత మాత్రమే కాదు, 2008లో అమెరికా ఆర్థిక పతనాన్ని పదేళ్ల క్రితమే వూహించిన ప్రఖ్యాత ఆర్థికవేత్త. అటువంటి వారి హెచ్చరికలను కూడా పెడ చెవినపెట్టి, అంత త్వరపడి ఆ విధానం కోసం అంతగా ఎందుకు పట్టుదల చూపుతున్నారో అర్థమే కావడం లేదు.

## జనవాణి

### నగదు బదలీ మంచి పథకం!

నగదు బదలీ పథకం పట్ల కేంద్ర ప్రభుత్వం సానుకూల నిర్ణయం తీసుకోవడం హర్షణీయం. ఇది వచ్చే ఏడాది జనవరి నుంచి 52 జిల్లాల్లో అమలు చేస్తామని ప్రకటించారు. ప్రజా పంపిణీ వ్యవస్థ మన రాష్ట్రంలో ఘోరంగా తయారయ్యింది. చౌక ధరల దుకాణాల్లో బియ్యం, పప్పులు, కిరోసిన్, నూనె, చక్కెర అసలివ్వడం లేదు. గ్రామాల్లో డీలర్లు మాఫియాలుగా తయారయ్యారు. వీరికి రెవిన్యూ, పౌరసరఫరాల శాఖాధికారులు బాగా సహకరిస్తున్నారు. నగదు బదలీ పథకం కట్టుదిట్టంగా అమలు చేస్తే బోగస్ రేషన్ కార్డుదారులందరూ మటుమాయమవుతారు. దేశ ఆర్థిక వ్యవస్థకు కూడా నగదు బదలీ పథకం మేలు చేస్తుందని ఆకాంక్షిస్తున్నాను.

గడ్డం తిరుపాలురెడ్డి — మహమ్మదాపురం

### నెల్లూరులో ల్యాబ్‌ల పనితీరు బాగోలేదు!

ఎవరైనా ఏదైనా రుగ్మతతో బాధపడే సమయంలో డాక్టర్ ఖచ్చితంగా రోగ నిర్ధారణకు ల్యాబ్ నిర్వాహకుడు(ఫథాలజిస్ట్) ఇచ్చే నివేదిక ఆధారంగా వైద్యం చేస్తాడు. మందులు వ్రాసిస్తాడు. దీంతో రోగం నెమ్మదిస్తుంది. కానీ నెల్లూరులోని కొన్ని ల్యాబ్‌లలో రోగ నిర్ధారణ పరీక్షలు సరిగా చేయడం లేదు. ఇటీవల ఒక వ్యక్తి చిన్న ఇబ్బందితో బాధపడుతూ డాక్టర్ దగ్గరకు వెళ్తే ఆయన బృందావనంలోని ల్యాబ్‌కు పరీక్షకు పంపాడు. వాళ్లు ఆయనకు షుగర్ వ్యాధి ఉందని నిర్ధారించారు. అనుమానంతో ఆ వ్యక్తి మరో రెండు ల్యాబుల్లో తిరిగి ఇదే పరీక్ష చేయించుకుంటే షుగర్ లేదని తేలింది. డాక్టర్లు కమీషన్ల కక్కుర్తితో అనుభవశూన్యులు, అర్హతలేని టెక్నీషియన్లు ఉండే ల్యాబులకు పరీక్షలకు పంపుతూ తమ వద్దకు వచ్చే రోగుల జీవితాలను నాశనం చేయవద్దని మనవి.

సోలా జానకీదేవి — నెల్లూరు

### విప్రులను కించపరచడం తగదు!

మంచు మోహన్‌బాబు కుటుంబీకులు తమ సినిమాల్లో తమ కుటుంబం గూర్చి గొప్పలు చెప్పు కోవచ్చు. రకరకాలుగా స్వంత డబ్బా వాయించుకోవచ్చు. అంతేగానీ తమ సినిమాల్లో ఒక కులాన్ని, వర్గాన్ని, అన్యులను చులకనచేసి చూపడం అనైతికం.

కాకుటూరు సుజాత — కావలి

### దినేష్‌రెడ్డికి అభినందనలు!

భారత హాకీ సమాఖ్య అధ్యక్షునిగా నెల్లూరీయుడు, డిజిపి వేణుంబాక దినేష్‌రెడ్డి ఏకగ్రీవంగా ఎన్నికకావడం ద్వారా సింహపురికి కీర్తిప్రతిష్టలు తెచ్చిపెట్టారు. ప్రస్తుతం హైదరాబాద్ హాకీ సంఘానికి ఆయన అధ్యక్షుడు.దినేష్‌రెడ్డి నీతినిజాయితీలు, సమర్థతో పదవి పొందినందుకు అభినందనలు.

ఎస్.బాబూరావు — కావలి

## 70 ఏళ్ల క్రితం ఈవారం

4-12-1942
పేజీలు : 8 వెల: అణా

### నెల్లూరు నగర జ్యోతి

నెల్లూరులో గోడల మీద వ్రాయడం, వార్తలకు, నిందలకు అధిక వ్యాప్తిని కలుగజేయడం పద్మనాభయ్య ప్రారంభించి, కటువైనా ఆదర్శప్రాయంగా సాగించినాడు. తర్వాత సత్రం వద్ద వార్తల గోడకు ముత్తరాజు గోపాలు వారసుడయినాడు. పాపం ఆ బ్రహ్మచారి మిడి ఎండలో గోడ మీద జోరు చమటలో వ్రాసి ఆతురతతో మూగే జనానికి తృప్తి గూర్చినాడు. ఆయన దినాలలో గోడకు మంచి స్టాండర్డు.

విశేషమేమిటంటే పత్రికలు చదివేవాళ్లు గూడా దీనిపై వ్రాతలు చదువుతారు. ఇంకా దీని వ్రాతలు నెల్లూరు వారికి వేదాలంతటి ప్రమాణాలు. ఈ విధమైన న్యూస్ బోర్డు యే పట్టణంలో గూడా లేకపోవడమే కాకుండా ఈ గోడకు మంచి గౌరవం ప్రతి చోట.

ఇది వ్రాయడం లాభంలేని అరవ చారికి – ఇంకా విశేషమైన ప్రయాస గూడాను. దమ్మిడీ లాభం లేకుండా ఇప్పుడు వ్రాసే ఇంద్రగంటి సుబ్రహ్మణ్యం గారి సేవకు నిజంగా ధన్యవాదాలే.

కానీ కొన్ని సలహాలు – ఇంతకు ముందు వారి వలనే ప్రయాస అనక, ప్రజలు మూగే ముందు వ్రాస్తే, వ్రాసే చదివే వారికి సౌకర్యం. ఆ గోడ ఇంతవరకు Un Personalగా దేశ విషయాలు మాత్రం ప్రకటించేది. కానీ ఇప్పుడు పూరి నాటకాలు, సినిమాల ప్రకటనలు, ఆ నాయరు కిళ్లీమేలు – యీయన జోస్యం మెరుగు – ఆమె పాలు పలచన – అని ఇట్లాంటి క్రింది తరగతి అడ్వర్‌టైజుమెంట్లకు చోటీయడం – ఆ గోడకు కళంకము. నీవుజేసే నిష్కామ కర్మకు అపకీర్తి. కాబట్టి గోడ Standard తగ్గనీయకుండా పట్టుక రావడం ఇంద్ర Gun.T. వారి బాధ్యత.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

30-11-1962
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### నెల్లూరు ముచ్చట్లు

#### ముఖ్యమంత్రి

నీలం సంజీవరెడ్డి గారు డిశంబరు 27, 28, 29 తేదులలో జిల్లాలో సంచరిస్తారట. ఆ సందర్భంలో వారికి 2 లక్షల రూపాయలు రక్షణ నిధిని సమర్పించుటకు చంద్రశేఖర్ రెడ్డి గారి జిల్లా పరిషత్తు గట్టిగా కృషి చేస్తుంది. ఇంతే గాదు, నెలకు లక్ష రూపాయలు సేకరించాలని చంద్రశేఖర్‌రెడ్డి సంకల్పం.

#### తుఫాను

29వ తేది మధ్యాహ్నం 2 గంటల నుంచి రాత్రి 9 గంటల వరకు నెల్లూరు జిల్లా తుఫాను తాకిడికి గురియైనది. సుడులు సుడులుగా వీచిన ప్రచండమై గాలితో కొద్దిపాటి వర్షం కురిసింది. టౌన్‌లో రోడ్డు కడ్డంగా అనేక చెట్లు పడిపోయి రాకపోకలకు అంతరాయం కలిగింది. విద్యుచ్ఛక్తి విఫలమై ప్రజా జీవితం స్తంభించి పోయింది. ఆస్తి నష్టం విశేషంగా లేదు.

కానీ పల్లెలలో అరటి మున్నగు తోట పైర్లకు విపరీతమైన నష్టం సంభవించినట్లు తెలుస్తున్నది. ఒక్క ఇనమడుగు, లేగుంటపాడు గ్రామాలలోనే 300 ఎకరాలలోని అరటి చెట్లు భీభత్సంగా పడిపోయాయని, వీటి వల్లనే 3 లక్షల రూపాయల నష్టం ఉంటుందని అంచనా వేస్తున్నారు. జిల్లాలోని ఇతర చోట్ల నష్టం వివరాలు ఇంకా తెలియుట లేదు.

# నెల్లూరు ముచ్చట్లు

## ఎమ్పీ పేరు చెప్పి డబ్బు వసూళ్లు!

నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజ మోహన్‌రెడ్డికి చెప్పి సూళ్లూరుపేట అసెంబ్లీ స్థానానికి టిక్కెట్లు ఇప్పిస్తామని ఎమ్పీ ఆఫీసులోనే ఉండే ఇద్దరు 'రెడ్లు' ఓ ఆశావహ అభ్యర్థి దగ్గర ఐదు లక్షల రూపాయలు పుచ్చుకొన్న విషయమై గగ్గోలు రేగింది. రిజర్వుడ్ స్థానాల్లో తాము చెప్పినట్లే అభ్యర్థుల ఎంపిక ఉంటుందని పలువురిని వీరిద్దరూ నమ్మబలుకుతున్నట్లు తెలిసింది. వీరిద్దరి మాట ఎమ్పీ బాగా వింటుండడంతో వీరిపై పలువురు నమ్మకం పెంచుకొని పెద్ద మొత్తాలు ఇవ్వడానికి ముందుకు వస్తున్నట్లు తెలిసింది. ఇటువంటి వ్యక్తులను దూరంగా పెట్టకుంటే రాజమోహన్‌రెడ్డి భవిష్యత్తులో ఇబ్బందులు ఎదుర్కోవడం ఖాయం.

## వాలంటరీ రిటైర్‌మెంట్ రొట్టె సిద్ధంగా ఉంది!

28వ తేది బారాషహీద్ దర్గా దగ్గర కాంగ్రెస్ నాయకులు రొట్టెలు వదులుతున్న సందర్భంగా చిత్రమైన చర్చ జరిగింది. రొట్టెలు వదులుతున్న నేతలను ఉద్దేశించి నగరంలో తిరుగులేని మహిళా నేత నేను హిమాలయ యాత్ర, ప్రమోషన్ రొట్టెల బోర్డులు పెట్టమన్నానే అని వ్యాఖ్యానించిందట. దీనికి ప్రతిగా ఆనం విజయకుమార్‌రెడ్డి వాలంటరీ రిటైర్‌మెంట్ రొట్టె సిద్ధంగా ఉందని వ్యాఖ్యానించాడట. ఈ 'రొట్టె' ఎవరికన్న విషయమై నగరంలో పెద్ద చర్చ జరుగుతుంది.

## విఆర్‌కు... సిఐడి విజయకుమార్!

నెల్లూరు సిబిసిఐడి డిఎస్పీగా బాధ్యతలను నిర్వహిస్తుండిన విజయకుమార్‌ను ఆ శాఖ ఉన్నతాధికారులు విఆర్‌కు పిలిచారు. ఆయన ఇప్పటివరకు విచారించిన మనీసర్క్యులేషన్ స్కీం వ్యవహారాలను స్పెషల్ ఇన్వెస్టిగేషన్ టీం(సిట్) విచారిస్తుందని సాక్షాత్తు డిజిపి దినేష్‌రెడ్డి ప్రకటించడం విశేషం. విజయకుమార్ మనీ సర్క్యులేషన్ స్కీం వ్యవహారాల దర్యాప్తు అధికారిగా దిగక మునుపు వ్యక్తిగతంగా, డ్యూటీపరంగా ఉత్తమ అధికారి. ఇప్పుడాయన పీకల్లోతు అవినీతిలో మునిగిపోయాడు. ఈ ఊబి నుంచి ఎలా బయట పడతారో చూడాలి. మనీ సర్క్యులేషన్ స్కీం దర్యాప్తు బాధ్యతను చేయి మార్చడం వల్ల బాధితులకు ఎప్పటికి న్యాయం జరుగుతుందో ఇప్పటికీ చెప్పలేని పరిస్థితి.



## నెల్లూరును కమ్మిన పొగమంచు!

నెల్లూరు నగరాన్ని 25, 26, 27 తేదీల్లో పొగ మంచు కమ్మేసింది. నవంబరు నెలలో విచిత్రమైన ఈ వాతావరణానికి ఆరోగ్యవంతులు కూడా అనారోగ్యవంతులయ్యారు. బారాషహీద్ దర్గా దగ్గర రొట్టెల పండుగకు వచ్చిన భక్తులు మాత్రం ఈ మంచుకు గజగజ వణికిపోయారు.

## ఎవి కృష్ణారెడ్డి చేతికి టౌన్‌హాల్ పెత్తనం!



నెల్లూరు టౌన్‌హాల్ కార్య నిర్వాహక కమిటీ కార్యదర్శిగా ఎవి కృష్ణారెడ్డి 22వ తేది మూడో కంటికి తెలియకుండా బాధ్యతలు తీసుకొన్నారు. ఈ బాధ్యతలను వదాన్యుడు జెఎస్‌రెడ్డి నిర్వహిస్తుండినాడు. కమిటీ సభ్యుడైన రేబాల హరిశ్చంద్రారెడ్డి చేసిన కిరికిరి మూలంగా జెఎస్‌రెడ్డి ఈ బాధ్యతల నుంచి తప్పుకోవాల్సి వచ్చింది. సాంకేతిక అవరోధాలు తొలగిపోయాక జెఎస్‌రెడ్డికే ఈ బాధ్యతలు అప్పజెబుతారట. అప్పటివరకు ఎవి కృష్ణారెడ్డి ఈ భారం మోస్తారు. ఎవి కృష్ణారెడ్డి నిశ్శబ్దంగా తన పని తాను చేసుకపోయే తత్వంగల పెద్ద మనిషి. గతంలో గాంధీ నగర్ సాయిబాబా మందిరం పాలక వర్గం అధ్యక్షునిగా ఆ మందిరం అభివృద్ధికి ఇతోధికంగా కృషి చేశారాయన. జెఎస్‌రెడ్డిని కాదనలేక టౌన్‌హాల్ పెత్తనం తీసుకోక తప్పలేదాయనకు.

## జంబ్లింగ్ పద్ధతిలో ఇంటర్ ప్రాక్టికల్స్!

ఇంటర్ ఎమ్పీపి, బైపిసి చదివే విద్యార్థులకు ఈసారి జంబ్లింగ్ పద్ధతిలో ప్రాక్టికల్స్ నిర్వహించను ఇంటర్మీడియట్ బోర్డు నిర్ణయం తీసుకొంది. విద్యాబోధనలో పేరుగాంచిన నెల్లూరులోని కార్పొరేట్ కాలేజీల్లో కూడా శుద్ధమైన ల్యాబులు లేవు. డూప్ పద్ధతిన ప్రాక్టికల్స్ జరుగుతాయి. ఇటువంటి పరిస్థితుల్లో ప్రాక్టికల్ పరీక్షలు ఎలా సక్రమంగా నిర్వహిస్తారో ఇంటర్ పరీక్షల ఆర్ఐఓ పరంధామయ్యకే తెలియాలి. జిల్లాలో 156 జూనియర్ కాలేజీలున్నాయి. వీటిలో 18వేల మంది విద్యార్థులు సైన్స్ గ్రూపు చదువుతున్నారు.

## డిఆర్ఓకు అదనపు బాధ్యతలు

డిఆర్ఓ రామిరెడ్డికి అదనపు బాధ్యతలు అప్పగించారు. అదనపు జెసి లక్ష్మీకాంతాన్ని ప్రభుత్వం జాయింట్ కలెక్టర్‌గా నియమించడంతో ఆయన నిర్వహిస్తుండిన అదనపు జాయింట్ కలెక్టర్ బాధ్యతలతోపాటు కార్పొరేషన్ ప్రత్యేకాధికారి బాధ్యతా డిఆర్ఓపైన పడింది. ఆయన ఎలా వీటిని నిర్వహిస్తారో చూడాలి.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా Online లో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## తనికెళ్ల భరణికి నాగభైరవ అవార్డు

ప్రఖ్యాత నటుడు, రచయిత తనికెళ్ల భరణికి ఈ ఏడాది ప్రతిష్టాత్మకమైన డాక్టర్ నాగభైరవ అవార్డును అందజేస్తున్నట్లు అవార్డు కమిటీ ప్రకటించింది. నాగభైరవ స్మృత్యర్థం అవార్డును అందించే ప్రక్రియను 2009న ప్రారంభించారు. ఇప్పటివరకు మల్లెమాల, దర్భశయనం, రసరాజుకు ఈ అవార్డును అందించామని, 2012కు భరణిని ఎంపిక చేశామని అవార్డు కమిటీ తెలిపింది. డిసెంబర్ 2న టౌన్‌హాల్లో అవార్డు ప్రదానోత్సవ సభ జరుగుతుందన్నారు.



నెల్లూరు మాగుంట లేఅవుట్‌లో మాడ్రన్ ఎరా జంట్స్ షోరూంను ప్రారంభిస్తున్న సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధరకృష్ణారెడ్డి. ప్రక్కన ఆనం రంగమయూర్‌రెడ్డి, భానుశ్రీలతో షోరూం అధినేతలు సమీర్, చంద్రగుప్త వున్నారు.

## అభినందన సభ

నెల్లూరు జాయింట్ సబ్ – రిజిస్ట్రార్ పూడి నరేంద్రరావు పదవీ విరమణ సందర్భంగా ఆయన అభిమానులు డిశంబర్ 2వ తేది ఉదయం 11 గంటలకు అనిల్ గార్డెన్స్‌లో అభినందన సభ ఏర్పాటు చేస్తున్నారు. రిజిస్ట్రేషన్ శాఖ డిప్యూటీ ఇన్స్‌పెక్టర్ జనరల్ స్థాయి అధికారి నుంచి క్రిందిస్థాయి ఉద్యోగుల వరకు హాజరవుతారు. సినీగేయ రచయిత సుద్దాల ఆశోక్‌తేజ, మాటల మాంత్రికుడు ప్రాసమణి ముఖ్య అతిథులు.

నెల్లూరు రిజిస్ట్రార్‌గా నరేంద్రలా రాణించిన అధికారి లేడు. ఎంత ఎదిగినా ఒదిగి ఉండే లక్షణం ఆయన సొంతం. నరేంద్రరావు ఖాళీగా ఉండలేడు. ఏదో ఒక వ్యాపకం పెట్టుకోకుంటే సమయం గడవదాయనకు. స్వర్గస్తురాలైన ఆయన సతీమణి బుజ్జమ్మ పేరిట ట్రస్ట్ వంటివి పెట్టి సామాజిక సేవలో మసలితే బాగుంటుందని మా సలహా.

## మోడ్రన్ ఎరా ప్రారంభం

మాగుంట లేఅవుట్‌లో నూతనంగా ఏర్పాటు చేసిన జంట్స్ రెడిమేడ్స్ షోరూం మోడ్రన్ ఎరా నవంబర్ 24న ప్రారంభించారు. ఈ ప్రారంభోత్సవ కార్యక్రమానికి విచ్చేసిన నగర ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి మాట్లాడుతూ నేటి యువతరానికి కావాల్సిన అన్ని రకాల దుస్తులు లభించేలా ఏర్పాటు చేసిన మోడ్రన్ ఎరా నిర్వాహకులను అభినందించారు. మారుతున్న ఫ్యాషన్‌కు అనుగుణంగా కొంగొత్త మోడల్స్‌ను అందుబాటులో ఉంచుతున్నట్లు షోరూం నిర్వాహకుడు సమీర్ తెలిపారు. ఈ కార్యక్రమంలో ఆనం రంగమయూర్‌రెడ్డి, మోడ్రన్ సోర్ట్ నిర్వాహకుడు నరసింహారావు, చంద్రగుప్త, మాజీ మేయర్ భానుశ్రీ, మోడరన్ జ్యూయలర్స్ అధినేత ప్రభాకర్‌బాబు తదితరులు పాల్గొన్నారు.

## యూనివర్శిటీ రొట్టె

రొట్టెల పండుగ సందర్భంగా ఈసారి కొత్తగా యూనివర్శిటీ పేరుతో రొట్టెను పట్టుకోవడం విశేషం. ఇప్పటి వరకు యూనివర్శిటీకి సొంత భవనం ఏర్పాటు కానందున విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. టిఎన్ఎస్ఎఫ్ విద్యార్థులు యూనివర్శిటీకి సొంత భవనాలు, పూర్తిస్థాయిలో సౌకర్యాలు ఏర్పడాలని రొట్టె వదలగా విద్యార్థినులు పట్టుకొన్నారు.

## పులిమి సుధాకర్‌రెడ్డి మరణం

నెల్లూరు వాస్తవ్యుడు, అందరితో స్నేహంగా మసలే మంచి మనిషి పులిమి సుధాకర్‌రెడ్డి(63) 24వ తేది మరణించారు. సుధాకర్‌రెడ్డి విద్యానగర్ లోని ఎన్‌బికెఆర్ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజిలో 1971 నుంచి 2004 వరకు వివిధ హోదాలలో సేవలు అందించి ప్రిన్సిపాల్‌గా రిటైర్డ్ అయ్యారు. తర్వాత ఆదిత్య విద్యాసంస్థలలో ప్రిన్సిపాల్‌గా సేవలందిస్తున్నారు. ఈయనకు భార్య, కుమారుడు ఉన్నారు. సుధాకర్‌రెడ్డి మరణానికి నేదురుమల్లి పద్మనాభరెడ్డి, ఆచార్య ఆదిత్య సానుభూతిని తెలియజేశారు.

# నెల్లూరులో బోగస్ విద్యాసంస్థలు!

**సింగిల్ సిట్టింగ్‌లో బి.ఏ, ఎంఏ పట్టాలిస్తామంటున్నారు.**

జిల్లాలో బోగస్ విద్యాసంస్థలు పుట్టగొడుగుల్లా వెలుస్తున్నాయి. సింగిల్ సిట్టింగ్‌లో డిగ్రీ, ఎలాంటి విద్యార్హత లేకుండా పిజి కోర్సు చేయవచ్చంటూ ప్రకటనలతో ఊదరగొడ్తూ నిట్టనిలువునా దగా చేస్తున్నాయి. వివిధ కారణాలతో చదువు కొనసాగించలేక, డిగ్రీ చదవాలని వున్న చదవలేక, ఇతరత్రా అవసరాల నిమిత్తం డిగ్రీ చదవాలనుకొనేవారు చాలా మంది వున్నారు. ఇలాంటి వారిని బుట్టలో వేసుకొని సులభంగా, సింగిల్ సిట్టింగ్‌తో డిగ్రీ చేసేయవచ్చని ప్రకటనలు గుప్పిస్తున్నాయి కొన్ని విద్యాసంస్థలు. ఇందులో నిజం నేతిబీరకాయ చందం. రాష్ట్రంలో సింగిల్ సిట్టింగ్ డిగ్రీలను 1995లోనే రద్దు చేసేశారు. ఉస్మానియా, కాకతీయ, ఆంధ్రా యూనివర్శిటీలు 1995 సంవత్సరం వరకు సింగిల్ సిట్టింగ్ డిగ్రీలను నిర్వహిస్తుండేవి. ఈ విధానంలో అభ్యర్థులు మూడేళ్ల డిగ్రీ కోర్సును ఒక ఏడాదిలోనే పూర్తి చేయవచ్చు. అందుకోసం అన్ని సబ్జెక్టులకు ఒకేసారి పరీక్ష వ్రాయాల్సి వుంటుంది. 1995లో ఈ డిగ్రీలకు స్వస్తి చెప్పాయి యూనివర్శిటీలు. కాకపోతే 2002 వరకు డిగ్రీ పూర్తి చేయలేని వారికి అవకాశాన్ని కల్పించాయి. ఆ తర్వాత ఇలాంటివి ఏ యూనివర్శిటీ నిర్వహించలేదు. డిగ్రీ చేయాలనుకొన్న వారి ఆసక్తిని అవకాశంగా చేసుకొని బోగస్ విద్యాసంస్థలు సులభంగా సింగిల్ సిట్టింగ్ డిగ్రీ పేరుతో విద్యార్థులపై వల విసురుతున్నాయి. ఇతర రాష్ట్రాలలో ఊరు, పేరు లేని యూనివర్శిటీలు, ప్రభుత్వ గుర్తింపులేని యూనివర్శిటీలలో డిగ్రీ పూర్తి చేయొచ్చంటూ నిలువు దోపిడీ చేస్తున్నాయి. అభ్యర్థి పరీక్ష వ్రాస్తే ఒక రేటు, వేరేవారి చేత వ్రాయిస్తే మరొకరేటుతో ధరలు నిర్ణయించి, అన్ని మేమే చూసుకొంటామంటూ 30వేల రూపాయల నుంచి లక్ష రూపాయల వరకు దండేస్తున్నాయి. పత్రికలలో ప్రకటనలు చూసి ఉద్యోగాలు, డిగ్రీ అవసరాల నిమిత్తం వచ్చేవారి నుంచి అందినంత వసూలు చేస్తున్న సంస్థలు జిల్లాలో అధికంగా వున్నట్లు సమాచారం. గతంలోనూ చాకలివీధి దండువారివీధి, ఆచారివీధి, కొండాయపాళెం గేటు వద్ద ఇలాంటి సంస్థలను ఏర్పాటుచేసి అభ్యర్థుల నుంచి ఒరిజినల్ సర్టిఫికేట్లు, నగదు వసూలు చేసి బోర్డు తిప్పిన నయవంచకులు వున్నారు. అలాంటి మోసగాళ్లు మళ్లీ విద్యాసంస్థలు ఏర్పాటు చేసి చదువుకోవాలన్న ఆసక్తి వుండేవారిని వంచిస్తున్నారు. ఇలాంటి వారిపట్ల పోలీసులు తగిన దృష్టి సారిస్తే పలువురు నష్టపోకుండా వుంటారు.

## అటకెక్కిన ఇందిరమ్మ ఇళ్ల విచారణ!

### దర్యాప్తుకు ఆదేశించి నెలలు గడుస్తున్నాయి.



నెల్లూరు వైఎస్ఆర్‌నగర్‌లో కుప్పకూలిన ఇందిరమ్మ ఇల్లు.(ఫైల్‌ఫోటో).

పేదలకు గూడు వసతి కల్పించేందుకు ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా నిర్వహిస్తున్న ఇందిరమ్మ ఇళ్ల పథకంలో అడుగడుగునా అవినీతి, అధికార బలం రాజ్యమేలుతుండడంతో లబ్ధిదారులకు న్యాయం జరగడం లేదు. ఇందుకు కొత్తూరులో నిర్మిస్తున్న ఇందిరమ్మ గృహాలే నిదర్శనం. ఇక్కడ నిర్మించిన ఇందిరమ్మ ఇళ్లను పరమ నాసిరకంగా నిర్మించారు. దీనిపై తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబు నాయుడుతో సహా పలు పార్టీల వారు అవినీతిని ఎండగట్టారు. కానీ రూరల్ శాసనసభ్యుడు వివేకానందరెడ్డి మాత్రం అవినీతికి అండదండలు అందించడంతో ఆయన తాబేదార్ల నాణ్యతకు తిలోదకాలు వదిలి నిర్మించిన ఇళ్లు కుప్పకూలిపోయాయి. ఈ ఘటన ఇందిరమ్మ ఇళ్లలో జరిగిన అవినీతికి నిలువెత్తు నిదర్శనంగా నిలచింది. ఈ వ్యవహారమై వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీతోపాటు, ప్రతిపక్ష తెలుగుదేశం పార్టీలు అరిచి గోల చేశాయి. ఇళ్లు కూలిపోవడానికి కారణమైన వారిపై చర్యలు చేపట్టాలని ఆందోళన జరిపాయి. హౌసింగ్ అధికారులు రంగ ప్రవేశం చేసి కాంట్రాక్టర్లకు క్లీన్‌చిట్ ఇచ్చి, దీనిపై విచారణ జరుపుతామని సహజసిద్ధమైన ప్రకటనలు చేశారు. ఘటన జరిగి నెలలు గడుస్తున్నా విచారణలో అతిగతీ లేదు. ఎందుకు ఇళ్లు కూలిపోయాయో చిన్నపిల్లవాడిని అడిగినా అవినీతి కారణంగా, నాసిరకం నిర్మాణాల కారణంగా అని సమాధానం చెప్తాడు. కానీ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి బెదరింపులకు భయపడిపోయే అధికారులకు, అవినీతిలో భాగస్వాములైన అధికారులకు మాత్రం ఇందిరమ్మ ఇళ్లలో అవినీతి కన్పించడం లేదు. అంతా బాగుంది అని సర్టిఫికేట్ ఇచ్చే హౌసింగ్ అధికారులు ఈ ఘటనపై ఏమి విచారించారో, ఇళ్లు కూలిపోవడానికి ఏమి కారణంగా తేల్చారో వారికే తెలియాలి. అన్ని పార్టీలు దీని గురించి పట్టించుకోవడం మానేయడంతో అంతా గప్‌చుప్ అయ్యింది.

## శివాలయాలు కిటకిట!

### నెల్లూరులో కార్తీక మాస శోభ



మూలస్థానేశ్వర ఆలయంలో కార్తీక దీపోత్సవం.

కార్తీక శుక్రవారాన్ని పురస్కరించుకొని నగరంలోని శివాలయాలు 23తేది కిక్కిరిసాయి. ఈ సందర్భంగా శివాలయాల్లో అభిషేకాలు, అర్చనలు, వ్రతాలు నిర్వహించారు. మూలపేటలోని మూలస్థానేశ్వరాలయం, దైకస్‌రోడ్డులోని ఉమామహేశ్వరాలయం, ఉస్మాన్‌సాహెబ్‌పేటలోని నాగమల్లేశ్వరాలయాల్లో ప్రత్యేక పూజలు, ఆకాశ దీపారాధనలు, అఖండ దీపారాధనలు నిర్వహించారు. భక్తులకు అన్నదానాలు చేశారు. కార్తీక మాసంలో ఉసిరిక చెట్టును పూజించి దాని కింద భోజనాలు చేస్తే ఫలితముంటుందనే నమ్మకంతో పలువురు భక్తులు మూలస్థానేశ్వరాలయం, మల్లేశ్వరస్వామి దేవస్థానంలో ఉసిరిక చెట్టు క్రింద భోజనాలు చేశారు. పలువురు కేదారేశ్వర, కార్తీక వ్రతాలు నిర్వహించారు.

## రెండు లక్షల రూపాయల పనికి పది లక్షల రూపాయల చెల్లింపు!

### అంతేవాసులకు ప్రజాధనం దోచిపెడుతున్న ప్రజాప్రతినిధి

కార్పొరేషన్ పరిధిలో వివిధ ప్యాకేజీల పేరుతో లక్షలాది రూపాయలను దోచిపెడుతున్నారు. రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి, అనుచరులు, మాజీ మహిళా ప్రతినిధి తాబేదార్లకు చిన్న చిన్న పనులకు ప్యాకేజీల క్రింద లక్షలాది రూపాయలు చెల్లిస్తుండడంతో ప్రజాధనం దుర్వినియోగం అవుతోంది. దీనికి చిన్న ఉదాహరణ భక్తవత్సలనగర్‌లోగల కెవిఎన్ఆర్ మునిసిపల్ ఉన్నత పాఠశాలలో పనులు. ఇక్కడ పాఠశాల ఆవరణలో గ్రావెల్ నింపేందుకు, ప్రహరీ గోడ ఎత్తు పెంచేందుకు ప్యాకేజి క్రింద మాజీ మేయర్ అనుచరుడికి ఏకంగా 10లక్షల రూపాయలతో పనులు కట్టబెట్టడం చర్చనీయాంశమయ్యింది. గ్రావెల్ లెవలింగ్‌కు, ప్రహరీ గోడ ఎత్తు పెంచేందుకు గట్టిగా అయితే రెండు లక్షల రూపాయలు మించదట. కానీ వివేకానందరెడ్డి ఆ మహిళా నేత కోరికపై చోటా కాంట్రాక్టర్, రాజశ్వేరి దేవస్థానంలో కమిటీ సభ్యుడైన అతనికి ప్యాకేజీ పనుల పేరుతో వాటిని అప్పగించారు. ఈ పని క్రింద దాదాపు ఏడు, ఎనిమిది లక్షల రూపాయలు అధికంగా చెల్లిస్తున్నారట ఆ కాంట్రాక్టర్‌కు. ఇంత బహిరంగంగా ప్రజాధనాన్ని పందికొక్కులవలె దోచుకతింటున్నారు ప్రజాప్రతినిధులు. ఇలాంటివి నగరంలో ఇటీవల కాలంలో అధికమయ్యాయి. అధికార మదం తలకెక్కడంతో అయినవాళ్లకు కాంట్రాక్టుల పేరుతో దోచిపెడుతున్నా జిల్లా అధికారులు పట్టించుకోకపోవడంతో ఇలాంటి అక్రమాలు జరుగుతూనే వున్నాయి.



భక్తవత్సలనగర్‌లోని కెవిఎన్ఆర్ స్కూల్‌లో ఈ చిన్నపనికి పెద్ద మొత్తం చెల్లించారు.



నెల్లూరు ఇరిగేషన్ డిపార్ట్‌మెంట్ డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్ మాలేపాటి బాబూరావు - వేణుకుమారిల కుమారుడు చేతన్‌కుమార్, హర్షిణిల వివాహం 23వ తేది తిరుపతిలోని రామతులసి కళ్యాణ మండపంలో జరిగింది.

● సర్వేపల్లిలో

# పాదయాత్రకు కాకాణి ఏర్పాట్లు!

## ● జనం మచ్చికకు యత్నం

సర్వేపల్లి నియోజకవర్గంలో వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ పాదయాత్రకు రూట్‌మ్యాప్ సిద్ధం చేస్తున్నట్లు ఆ పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి తెలిపారు. ఇటీవల ఆయన గొలగమూడి వెంకయ్యస్వామిని దర్శించుకొనేందుకు వచ్చారు. స్వామిని దర్శనం చేసుకొన్న అనంతరం ఆయన పార్టీ విధి విధానాలపై మాట్లాడారు. అన్ని గ్రామాల్లో స్థానిక నేతలను సమన్వయం చేసుకొని పాదయాత్ర చేపడుతున్నట్లు తెలిపారు. పార్టీని బలోపేతం చేయడం, ప్రజల సమస్యలు తెలుసుకోవడం పాదయాత్ర ముఖ్య ఉద్దేశమన్నారు. పనిలో పనిగా తెలుగుదేశం పార్టీపైనా, ఆ పార్టీ అధినేత చంద్రబాబునాయుడుపైనా విమర్శలు గుప్పించారు. ఆయన చేపట్టిన పాదయాత్ర ఒట్టి బూటకమన్నారు. చంద్రబాబునాయుడు చేస్తున్న పాదయాత్రలకు ప్రజల నుంచి స్పందన కరువైందన్నారు. దీనిని బట్టి ప్రజలకు ఆయన పట్ల ఎంత నమ్మకం వుందో అర్థమవుతున్నాదని ఎద్దేవా చేశారు. రైతుల సమస్యలను పట్టించుకోని ఆయన ఇప్పుడు వారిపట్ల కపట ప్రేమ ఒలకపోస్తున్నారని విమర్శించారు. జగన్ పట్ల వున్న నమ్మకానికి ప్రజల్లో వున్న అభిమానానికి వివిధ పార్టీల నుంచి వచ్చి వైఎస్ఆర్ పార్టీలో చేరుతున్న నేతలే ఉదాహరణని అన్నారు. ఈ కార్యక్రమంలో వైఎస్ఆర్ పార్టీ నేతలు చిల్లకూరు సుధీర్‌రెడ్డి, పద్మనాభరెడ్డి, శ్రీకాంత్‌రెడ్డి, ప్రదీప్‌కుమార్ రెడ్డి, సుబ్బరాయుడు, ఏడుకొండలు, రజనీకాంత్‌రెడ్డి, చెంచుకృష్ణయ్య, వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

# చంద్రబాబును జనం నమ్మరు!

### గూడూరులో తేల్చి చెప్పిన ప్రసన్న!



తెలుగుదేశం పార్టీ అధినేత నారా చంద్రబాబు నాయుడు ఎన్ని పాదయాత్రలు చేసినా ఆయన జన్మలో ఇక ముఖ్యమంత్రి కాలేడని కోవూరు శాసన సభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి విమర్శించారు. ఇటీవల ఆయన గూడూరు వచ్చిన సందర్భంగా విలేకరులతో మాట్లాడారు. పదవి కోసం చంద్రబాబు చేస్తున్న కుయుక్తులను ప్రజలు గమనిస్తున్నారని ఆయన ఎన్ని హామీలు ఇచ్చినా ప్రజలు నమ్మే స్థితిలో లేరన్నారు. పదికోట్ల రూపాయలకు ఒక్కో ఎమ్మెల్యే జగన్‌కు అమ్ముడుపోయారని చంద్రబాబునాయుడు చేసిన వ్యాఖ్యలను ఆయన తీవ్రంగా ఖండించారు. డబ్బుకు ఎమ్మెల్యేలు ఎవరూ అమ్ముడుపోవడం లేదని, జగన్ నాయకత్వంపై వున్న నమ్మకం, వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ మీద వున్న అభిమానంతో ఆ పార్టీలో చేరుతున్నారన్నారు. పార్టీ నుంచి నేతలు వెళ్లిపోతుంటే చూసి తట్టుకోలేక చంద్రబాబునాయుడు మతిస్థిమితం కోల్పోయి మాట్లాడుతున్నారన్నారని విమర్శించారు. ఇప్పటికైనా అసత్య ప్రచారాలు మానుకోవాలని హితవు చెప్పారు. అనంతరం మాజీ శాసనసభ్యుడు దివంగత జోగి మస్తానయ్య కుటుంబ సభ్యులను పరామర్శించారు. ప్రభుత్వం నుంచి వారికి అందాల్సినవి అన్ని అందేలా చూస్తానన్నారు.

---

● గూడూరు గ్యాస్ ఏజన్సీలను

# తనిఖీ చేసిన సబ్ కలెక్టర్!

గూడూరులో గత కొంతకాలంగా గ్యాస్ సరఫరా అస్తవ్యస్తంగా వుండడంతో వినియోగదారులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. సక్రమంగా సిలిండర్లు అందజేయకుండా పలు ఏజన్సీలు అక్రమాలకు పాల్పడుతున్నాయి. దీనిపై ప్రజల నుంచి ఫిర్యాదులు అందడంతో సబ్ కలెక్టర్ నివాస్ రంగంలోకి దిగారు. ఇతర అధికారులతో కలసి స్థానిక దుకాణాలు, హోటళ్లపై దాడులు నిర్వహించడంతోపాటు గ్యాస్ ఏజన్సీలను తనిఖీ చేశారు. వ్యాపారస్తులు గృహ అవసరాలకు వినియోగించే సిలిండర్లను అక్రమంగా వినియోగిస్తుండడంతో వాటిని స్వాధీనపరచుకొన్నారు. అనంతరం జనార్థన్ రెడ్డి కాలనీలో గల శ్రీసాయి గ్యాస్ ఏజన్సీని తనిఖీ చేయగా అక్కడ సిలిండర్ల సరఫరా, స్టాకులో తేడాలు వుండడాన్ని గమనించారు. గ్యాస్ బుక్ చేసుకొన్న వారికి సిలిండర్లు పంపిణీ చేయకపోవడంతోపాటు భారీ అవకతవకలు జరిగినట్లు గుర్తించి ఆ ఏజన్సీ నిర్వాహకులపై కేసు నమోదు చేశారు. అయితే ఈ గ్యాస్ ఏజన్సీ ఒక ప్రజాప్రతినిధి సోదరుడిది కావడంతో ఇలాంటి దాడులు, కేసులు నిలుస్తాయా అని పట్టణ ప్రజలు చర్చించుకొంటున్నారు. సబ్ కలెక్టర్ నిర్వహించిన దాడుల వల్లనైనా గ్యాస్ సిలిండర్ల సరఫరా సక్రమంగా జరుగుతుందేమో చూడాలి.

# వెంకటగిరి గబ్బు గబ్బు!

- క్షీణించిన పారిశుద్ధ్యం – పట్టించుకోని మునిసిపాలిటీ

వెంకటగిరి పట్టణంలో పారిశుద్ధ్యం క్షీణించింది. మునిసిపాలిటీ సిబ్బంది నిర్లక్ష్యం పట్టణంలో కొట్టొచ్చినట్లు కన్పడుతోంది. పేరుకపోయిన చెత్త, పొంగి పొర్లుతున్న మురుగునీరు, విజృంభిస్తున్న దోమలు ప్రజలను చికాకు పెడుతున్నాయి. పారిశుద్ధ్యం అస్తవ్యస్తంగా మారడంతో విష జ్వరాలు ప్రబలుతున్నాయి. పలువురు జ్వరాల బారినపడి ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నారు. ఇటీవల వెంకటగిరి పట్టణంలో శాసనసభ్యుడు కురుగొండ్ల రామకృష్ణ పర్యటించారు. ఆంజనేయస్వామి గుడి వీధి, పాలకేంద్రం తదితర ప్రాంతాల్లో తిరిగిన ఆయన అక్కడి పారిశుద్ధ్య పరిస్థితులను గమనించి తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేశారు. ఎక్కడికక్కడ చెత్త పేరుకపోయి వుండడంతో మునిసిపల్ సిబ్బందిపై మండిపడిన ఎమ్మెల్యే పారిశుద్ధ్యంపై దృష్టి సారించి ప్రజలకు ఎలాంటి ఇబ్బంది కలుగకుండా చూడాలన్నారు. వార్డుల్లో అవగాహన సదస్సులు నిర్వహించాలన్నారు. ఈ సందర్భంగా స్థానిక మహిళలు మంచినీటి సమస్య అధికంగా వుందని, త్రాగునీటి కోసం తీవ్ర ఇబ్బందులు పడుతున్నామని తెలిపారు. దీనికి స్పందించిన ఆయన మంచినీటి ఎద్దడి వున్న ప్రాంతాలకు త్రాగునీటిని ట్యాంకుల ద్వారా సరఫరా చేయాలని ఆదేశించారు. అలాగే పలు చోట్ల వీధి దీపాలు వెలగడం లేదని తెలుసుకొని ఆయా ప్రాంతాలలో కొత్త లైట్లు వేయాలని చెప్పారు. ఎమ్మెల్యే వెంట తెలుగు దేశం పార్టీ నేతలు బీరం రాజేశ్వరరావు, ప్రసాద్‌నాయుడు, సుధాకర్, గురువేంద్ర, ప్రసాద్ తదితరులు పాల్గొన్నారు.



నెల్లూరులో జరిగిన గ్రంథాలయ వారోత్సవాల ముగింపు సమావేశంలో ప్రసంగిస్తున్న ఎస్పీ బివి.రమణకుమార్. ప్రక్కన గ్రంథాలయ సంస్థ డైరక్టర్ ఉడత వెంకట్రావ్, రఘురామ్, చెంచలబాబు.

# హామీ నిలబెట్టుకొన్న సోమిరెడ్డి!



- విడవలూరులో పీర్ల చావడి నిర్మాణం

రాజకీయ నాయకులు ఎన్నికలో హామీలు గుప్పించడం సహజం. ఎన్నికలు అయిన తర్వాత వాటి గురించి మరచిపోతుంటారు. దీనికి భిన్నంగా ఎన్నికలలో ఇచ్చిన హామీని నిలబెట్టుకొన్నాడు తెలుగుదేశంపార్టీ సీనియర్ నేత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి. కోవూరు ఉపఎన్నికలలో పోటీ చేసిన సమయంలో కొడవలూరు మండలంలోని ముస్లింలు పీర్ల చావిడిని నిర్మింపజేయమని కోరగా అందుకు హామీ ఇచ్చాడు. దీనిని గుర్తించుకొని నాలుగు లక్షల రూపాయల సొంత నిధులతో పీర్ల చావిడిని నిర్మించారు. ఇటీవల ఆ ప్రారంభానికి వెళ్లిన సోమిరెడ్డి మాట్లాడుతూ తెలుగుదేశం ప్రభుత్వం ముస్లింల అభ్యున్నతికి ఎంతగానో పాటు పడిందన్నారు. తమ ప్రభుత్వ హయాంలో 13 జిల్లాల్లో ఉర్దూ భాషను ద్వితీయ భాషగా ప్రవేశపెట్టిన సంగతిని గుర్తు చేశారు. పలు సంక్షేమ పథకాల అమలు, దీపం పథకం క్రింద గ్యాస్ కనెక్షన్‌లు మంజూరు చేసిన ఘనత తెలుగుదేశం పార్టీదేనన్నారు. జాతీయ రహదారుల నిర్మాణం, తెలుగు గంగ, కండలేరు డ్యాంల నిర్మాణం ఇంజనీరింగ్ కళాశాల ఏర్పాటు టిడిపి ప్రభుత్వ కాలంలోనే జరిగిందన్నారు. పనిలో పనిగా ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డిపై విమర్శలు చేశారు. చెరకు రైతుల బకాయిలు రెండు వారాల్లో చెల్లిస్తామని ఆర్థిక మంత్రి మాట ఇచ్చారని, కానీ నెలలు గడుస్తున్న ఆ హామీని నిలబెట్టుకోలేకపోయారని ఎద్దేవా చేశారు. బకాయిలు నిలచిపోవడంతో రైతులు ఇబ్బందులు పడుతున్నందున తక్షణం బకాయిలు చెల్లించేలా చూడాలని డిమాండ్ చేశారు. అనంతరం పీర్ల చావిడి వద్ద అన్నదాన కార్యక్రమాన్ని ప్రారంభించారు.

## రైతు కోసమే 'ఆత్మ' పథకం!

### వెంకటగిరి ఎమ్మెల్యే ప్రకటన

ఆత్మ పథకం క్రింద ప్రవేశపెట్టే పథకాలను రైతులందరూ సద్వినియోగం చేసుకోవాలని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ సూచించారు. పట్టణంలో ఇటీవల జరిగిన అవగాహన సదస్సులో ఆయన పాల్గొని ప్రసంగించారు. రైతుల అభివృద్ధి కోసం ఆత్మపథకంలో కొత్తకొత్త పథకాలు వస్తున్నాయన్నారు. వీటిపై రైతులందరికి అవగాహన కల్పించాలన్నారు. అధికారుల సూచనతో పథకాలు సద్వినియోగం చేసుకోవాలన్నారు. రైతుల పంటలు దెబ్బతిన్నప్పుడు ప్రభుత్వం నష్టపరిహారాన్ని నామమాత్రంగా కాకుండా వారిని ఆదుకొనేలా వుండాలన్నారు. రైతులు నీటిని వృధా చేయకుండా పొదుపుగా వినియోగించుకోవాలన్నారు. రైతులను దృష్టిలో వుంచుకొని టిడిపి అధినేత చంద్రబాబునాయుడు పాదయాత్ర చేస్తున్నారని తెలిపారు. ఆత్మ పిడి గోవిందరాజులు మాట్లాడుతూ ఆత్మ పథకం రైతుల అభివృద్ధి కోసమేనని తెలిపారు. అనంతరం రైతులకు ట్రాక్టర్‌లను, వ్యవసాయ పని ముట్లను పంపిణీ చేశారు. ఈ సదస్సులో వ్యవసాయశాఖ ఎడి ఉషారాణి, వ్యవసాయాధికారులు గిరీష్ తదితరులు పాల్గొన్నారు.



నెల్లూరులోని పిసిఎస్‌ఆర్ ఫౌండేషన్ నేతృత్వంలో శిశు గృహలోని పిల్లలకు నెల రోజులకు సరిపడా నిత్యావసరాలను అందిస్తున్న ఫౌండేషన్ వ్యవస్థాపక అధ్యక్షుడు పావుజెన్ని చంద్రశేఖర్‌రెడ్డి.

# దెబ్బతినిపోయిన గ్రామీణ రోడ్లు!

జిల్లాలో గ్రామీణ రోడ్లు పూర్తిగా దెబ్బతినిపోయాయి. ఎక్కడ చూసినా గుంటలుపడి, రాళ్లు తేలిన రోడ్లే కన్పిస్తున్నాయి తప్ప, సుఖంగా ప్రయాణం సాగించేలా ఏ ఒక్క రోడ్డు లేకపోవడంతో వివిధ ప్రాంతాల ప్రజలు రాకపోకలు సాగించేందుకు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. వర్షాలు పడితే ఈ రోడ్లపై ప్రయాణం ఎంత ఘోరంగా వుంటుందో చెప్పనవసరం లేదు. దీనికి ఉదాహరణ ఉదయగిరి నియోజకవర్గంలోని గ్రామీణ రోడ్డు. నియోజకవర్గంలోని వివిధ మండలాల్లో ఇలాంటి దారుణమైన, ధ్వంసమైపోయిన రోడ్లే కన్పిస్తాయి. ముఖ్యంగా దుత్తలూరు మండలంలోని రోడ్లు రూపురేఖలు కోల్పోయి వున్నాయి. దుత్తలూరు, తిమ్మాపురం, బండక్రింద పల్లి, భైరవరం, జోడవారి పల్లె, పాపంపల్లి, తెడ్డుపాడు తదితర

### అధికారులు పాలకులకు పట్టదా?

గ్రామాల్లోని రోడ్లు దారుణంగా దెబ్బతిని వున్నాయి. సాధారణ రోజుల్లోనే ప్రయాణం కష్టతరంగా వున్న ఈరోడ్లపై వర్షం పడిన సందర్భాలలో ప్రయాణానికి ఆటంకాలు ఎదురౌతున్నాయి. గుంటలు కన్పించకపోవడంతో పలువురు ప్రమాదాలకు గురౌతున్నారు. ప్రజల ఇబ్బందులను దృష్టిలో పెట్టుకొనైనా రోడ్లకు మరమ్మత్తులు చేపట్టకపోవడం పట్ల విమర్శలు వ్యక్తం అవుతున్నాయి.

# భళా... చోళుల శిల్పకళా చాతుర్యం!

- కోడూరులో పురావస్తుశాఖ సంచాలకుడు.

జిల్లాలోని ప్రాచీన ఆలయాల అభివృద్ధికి చర్యలు చేపడుతున్నట్లు పురావస్తుశాఖ రాష్ట్ర సంచాలకులు జి.వి రామకృష్ణ తెలిపారు. తోటపల్లి గూడూరు మండలం కోడూరు గ్రామంలో గల పురాతన చెన్నకేశవస్వామి ఆలయాన్ని ఆయన సందర్శించారు. ఈ ఆలయ ఉనికిని కాపాడేందుకు తగిన చర్యలు చేపడుతున్నామన్నారు. తక్షణ సహాయం క్రింద 20లక్షల రూపాయలతో పనులు చేపట్టనున్నట్లు తెలిపారు. చోళుల కాలం నాటి శిల్పసంపదను ఆలయాన్ని చూస్తే అర్థమవుతుందన్నారు. ఇదే కాకుండా జిల్లాలో గల కొడవలూరు మండలంలోని ఉదయకాళేశ్వరస్వామి ఆలయాన్ని, ఆత్మకూరు మండలంలోని మహిమలూరు చెన్నకేశవస్వామి ఆలయం, దగదర్తి మండలం ఉలవపాడు వీరాంజనేయస్వామి ఆలయం, తడ మండలం మాంబట్టులోని కాశీ విశ్వేశ్వర ఆలయం, చేజర్ల మండలం కోటి తీర్థంలోగల కోటేశ్వర స్వామి ఆలయాలకు అంచలంచెలుగా నిధులను మంజూరు చేసి అభివృద్ధి పరచేందుకు ప్రణాళికలు రూపొందించామన్నారు. రాష్ట్రవ్యాప్తంగా 600 రక్షిత కట్టడాలు, 10 జిల్లాస్థాయి కట్టడాలు, 27 ప్రదర్శన శాలలను తమశాఖ పర్యవేక్షిస్తున్నాదన్నారు. 120మంది సెక్యూరిటి సిబ్బంది, 15మంది కంప్యూటర్ ఆపరేటర్లు, 25మంది స్వీపర్లు పని చేస్తున్నారని తెలిపారు.



విద్యానగర్‌లోని ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కాలేజీ విద్యార్థిని ప్రీతికి శస్త్ర చికిత్స నిమిత్తం 8లక్షలా 50వేల రూపాయల విరాళాన్ని వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ తరపున అందజేస్తున్న కాకాణి గోవర్ధన్‌రెడ్డి, పేర్నేటి శ్యాంప్రసాద్‌రెడ్డి, మెట్టుకూరు చిరంజీవిరెడ్డి, చింతం జనార్ధనరెడ్డి తదితరులు.

# అవినీతి ట్రాక్‌లో... కావలి ఆర్టీఓ ఆఫీసు!

## పైసా వసూల్‌లో రికార్డుల సృష్టి!

కావలి ఆర్‌టిఓ కార్యాలయం దళారుల రాజ్యంగా మారింది. ఏపని కావాలన్న చివరకు ఎల్‌ఎల్‌ఆర్ పొందాలన్నా ఏజంట్లను ఆశ్రయించాల్సి వస్తుండడంతో కార్యాలయానికి వివిధ పనులపై వచ్చేవారి జేబులు ఖాళీ అవుతున్నాయి. ఏజంట్ల వ్యవస్థను రద్దు చేసినా ఇక్కడ మాత్రం పెత్తనం అంతా వారిదే. వారు ఆడిందే ఆటగా మారడంతో లైసెన్సుల కోసం వచ్చేవారు, ట్యాక్స్ కట్టేందుకు వచ్చేవారు ఇబ్బందులు పడాల్సి వస్తోంది. దళారులు లేకుండా నేరుగా కార్యాలయ సిబ్బందిని కలిస్తే సవాలక్ష ప్రశ్నలు వేసి ఏదో ఒక కొర్రీ వేసి రోజుల తరబడి తిప్పుకొంటుండడంతో విధిలేని పరిస్థితుల్లో ఏజంట్లను ఆశ్రయించాల్సి వస్తోందని పలువురు



వాపోతున్నారు. డ్రైవింగ్ లైసెన్స్ పొందాలంటే కంప్యూటర్‌లో పరీక్ష పాసు కావాల్సి వుంటుంది. నేరుగా వెళితే అక్కడి సిబ్బంది కఠినమైన ప్రశ్నలు అడిగి పరీక్షలో పాసు కానందున మరోసారి రమ్మంటున్నారట. అదే ఏజెంట్‌కు డబ్బులు ముట్ట జెప్పి వెళితే క్షణాల్లో అర్హత సాధిస్తుండడం, ఎల్‌ఎల్‌ఆర్ చేతికి వచ్చేస్తుందట. ఒక్కో పనికి ఇంతరేటని నిర్ణయించి దాని ప్రకారం ముక్కుపిండి వసూలు చేస్తున్నారు ఏజంట్లు. అధికారులు రవాణా కార్యాలయాల్లో ఏజంట్లు లేరని బుకాయిస్తున్నా కావలి ఆర్టీవో కార్యాలయంలో చూస్తే సర్వం ఏజంట్ల మయం. సాయంత్రం వేళలో కార్యాలయ సిబ్బందికి బదులు ఏజంట్లు వారి సీట్లలో కూర్చొని అన్ని పనులు చేసేస్తుంటారట. రోజూ పెద్ద మొత్తంలో వాటాలు అధికారులకు వెళ్తుండడంతో ఏజంట్లది ఇష్టారాజ్యం అయ్యింది. ఏసిబి అధికారులు ఇటువైపు దృష్టి సారిస్తే అవినీతి భాగోతం బట్టబయలవుతుందని పలువురు కోరుకొంటున్నారు.

- బోగోలు ఆలయాలను

# దోచేస్తున్నారు!

బోగోలు మండలంలోని దేవాలయాలకు భద్రత కరువయ్యింది. ఆలయాలు, దర్గాల్లో దొంగలు పడి చేతికందిన వస్తువులను తస్కరించుకొని వెళ్తుండడంతో దేవుళ్లకే దిక్కులేకుండాపోతోంది. మండలంలోని కోవూరుపల్లి పంచాయితీలోగల పోలేరమ్మ గుడిలో ఇప్పటికి మూడు సార్లు హుండీని దొంగిలించారు. బోగోలు పంచాయితీలోని వినాయకుడి గుడి హుండీ పగులగొట్టి డబ్బులు తస్కరించుకొనిపోయారు. అదే ప్రాంతంలో గల ఖాదర్‌వలి దర్గా హుండీ దొంగతనానికి గురయ్యింది. ఏడాదికాలంగా ఇలాంటి దొంగతనాలు అధికమైనా పోలీసులు తగిన చర్యలు చేపట్టడంలో విఫలమయ్యారనే విమర్శలు వ్యక్తం

## పట్టించుకోని పోలీసు

అవుతున్నాయి. దీనికి తోడు చిల్లర దొంగతనాలు జోరందుకొన్నాయి. దీంతో మండలంలోని ప్రజలకు దొంగల భయం పట్టు కొంది. పాత నేరస్తులపై నిఘా వుంచడంలోను, దొంగతనాలు అరికట్టడంలోనూ పోలీసులు సరిగా వ్యవహరించకపోవడంతో ఇవి అధికమవుతున్నాయి. గతంలో కొందరు ఎస్‌ఐలు పని చేసిన కాలంలో దొంగలకు హడల్. తర్వాతి కాలంలో ఈ భయం లేకుండా పోయింది. దొంగలు, సంఘ వ్యతిరేకశక్తులతో కొందరు పోలీసులు స్నేహం చేస్తుండడం, బహిరంగంగా వారిచ్చే విందు వినోదాల్లో పాల్గొంటుండడంతో పోలీసులు తాము విదిలించే ఎంగిలి మెతుకులకు ఆశపడేవాళ్లు తమనేం చేస్తారులే అన్న లెక్కలేనితనం నేరస్తులు, అసాంఘిక శక్తులలో పెరిగిపోవడంతో బోగోలు మండలంలో దొంగల రాజ్యం అయ్యింది.





# ఆరోగ్యశ్రీ సమర్థంగా అమలు చేయండి!

*కావలిలో ఎమ్మెల్యే బీద సూచన*

పేద ప్రజలకు ఉపయోగపడడమే కాకుండా వైద్యశాలల అభివృద్ధికి అవకాశం కల్పిస్తున్న ఆరోగ్యశ్రీ పథకాన్ని సమర్థవంతంగా అమలు చేయాలని కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు వైద్యులకు సూచించారు. ఇటీవల ఆయన కావలిలో గల ప్రాంతీయ వైద్యశాలను సందర్శించి అక్కడ అందుతున్న వైద్య సేవలపై ఆరా తీశారు. పలు వార్డుల్లో తిరిగి రోగులను పరామర్శించిన అనంతరం వైద్యులతో సమావేశం అయ్యారు. ఆస్పత్రికి వచ్చే రోగులకు సరైన వైద్య చికిత్సలు అందేలా చూడాలన్నారు. డిసెంబర్ నెల నుంచి ఆరోగ్య సేవలు ఏరియా వైద్యశాలలో అందుబాటులోకి రానున్నాయని, దీని క్రింద సేవలందిస్తే మొత్తం బిల్లులో 60 శాతం వైద్యశాలకు, 40శాతం సంబంధిత వైద్యులకు అందుతాయని తెలిపారు. వైద్యశాల కమిటి ఛైర్మన్‌గా అత్యాధునిక వసతుల కోసం తనవంతు కృషి చేస్తానన్నారు. అనంతరం ఆయన పట్టణంలో గల తహశీల్దార్ కార్యాలయాన్ని, అదే ఆవరణలోగల మండల వ్యవసాయాధికారి, సహాయ సంచాలకుల కార్యాలయాలకు వెళ్లారు. రైతులకు అందుతున్న వివిధ పథకాలపై మాట్లాడారు. కష్టకాలంలో వున్న రైతాంగాన్ని అందుబాటులో వున్న ప్రభుత్వ పథకాలను అందించి అన్ని విధాలా ఆదుకోవాలన్నారు. ఈ సందర్భంగా అక్కడ మహిళా సిబ్బంది మరుగుదొడ్లు లేక ఇబ్బంది పడుతున్న విషయాన్ని ఎమ్మెల్యే దృష్టికి తీసుకొనిరాగా ఆయన తక్షణం స్పందిస్తూ 50వేల రూపాయలను మంజూరు చేస్తున్నట్లు చెప్పారు.

# కౌలు రైతులకు రుణాలు

- వెంకటగిరి తహశీల్దార్ ప్రకటన

అర్హత కల్గిన కౌలు రైతులకు రుణాలు ఇప్పించేందుకు కృషి చేస్తున్నట్లు వెంకటగిరి తహశీల్దార్ కృష్ణమూర్తి తెలిపారు. ఇటీవల పట్టణ పరిధిలోగల సిండికేట్ బ్యాంక్, ఆంధ్ర ప్రగతి గ్రామీణ బ్యాంక్‌తోపాటు పలు బ్యాంకు అధికారులతో సమీక్ష నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ కౌలు రైతులకు గుర్తింపు కార్డుల ద్వారా రుణాలు అందివ్వడమేకాక సబ్సిడీపై విత్తనాలు, ఎరువులు అందిస్తామన్నారు. సిండికేట్ బ్యాంక్ ద్వారా 11 మందికి, ఆంధ్రప్రగతి గ్రామీణ బ్యాంక్ బంగారుపేట శాఖ ద్వారా తొమ్మిది మందికి, వెంకటగిరి శాఖ ద్వారా మరో ఐదు మందికి కౌలు రైతులకు రుణాలు అందించేందుకు బ్యాంకులు సుముఖత వ్యక్తం చేశాయన్నారు. స్టేట్‌బ్యాంక్ అధికారులు రుణాల కోసం దరఖాస్తు చేసుకొన్న కౌలు రైతుల రికార్డులను పరిశీలిస్తున్నాయన్నారు. ఈ సమావేశంలో వెంకటగిరి వ్యవసాయాధికారి గిరీష్‌కుమార్, విస్తరణాధికారి రామ్మోహన్ తదితరులు పాల్గొన్నారు.

- జువ్వలదిన్నెలో

# సిజెఎఫ్ఎస్ భూముల వివాదం!

*దళితులు x మత్స్యకారులు*

బోగోలు మండలంలో మత్స్యకారులు, దళితుల నడుమ భూవివాదం నెలకొనింది. గతంలో అమ్మేసిన భూములను తిరిగి తమ స్వాధీనం చేయమంటున్నారంటూ మండలానికి చెందిన తాటిచెట్లపాళెం, బంగారుపాళెం గ్రామాలకు చెందిన మత్స్యకారులు ఆరోపించారు. మత్స్యకార నేతలు రామయ్య, వెంకటేశ్వర్లు ఆధ్వర్యంలో ఇటీవల వారు ఆర్‌డిఓ కార్యాలయం ఎదుట ఆందోళన చేపట్టారు. జువ్వలదిన్నెకు చెందిన దళితుల దగ్గర 1992 సంవత్సరంలో సిజెఎఫ్ఎస్ భూములను కొనుగోలు చేశామన్నారు. అప్పటి నుంచి తాము సాగు చేసుకొంటున్నామన్నారు. ఇటీవల భూముల ధరలు పెరగడంతో అమ్మిన భూములను తిరిగి తమకు స్వాధీనం చేయాలని పేచి పెడుతున్నారని ఆరోపించారు. అలాగే బోగోలు పంచాయితీ పరిధిలో గల అక్కరాజు కండ్రిగకు సంబంధించి ఇదే వివాదం ఏర్పడింది. నాగులవరం పంచాయితీ చెన్నారెడ్డిపాళెం, కొత్తూరు గ్రామంలో సైతం భూములను సాగు చేస్తున్న వారి వద్దకు వెళ్లి తిరిగి ఆ భూములు స్వాధీన పరచమని ఒత్తిడి చేస్తుండడంతో వివాదం ముదిరింది. రైతులు మాత్రం తాము అనేక సంవత్సరాలుగా సాగు చేసుకొంటున్నామని, అధికారులు గుర్తించి అడంగళ్, పాసు బుక్కులు ఇచ్చారని బ్యాంకుల్లో రుణాలు సైతం పొందామని, ఇలాంటి పరిస్థితుల్లో భూములు కావాలనడం ఎంత వరకు సమంజసమని వారు ప్రశ్నిస్తున్నారు. కొందరు కావాలని వీటిపై వివాదం రాజేస్తున్నారని, దళితుల భూములు సాగు చేసుకొంటున్న వారి వివరాలు తెలుసుకొని వారి వద్దకు వెళ్లి బెదిరిస్తున్నారని ఆర్‌డిఓ సుబ్రహ్మణ్యేశ్వరరెడ్డికి ఫిర్యాదు చేశారు.



# సౌభాగ్యదాయిని కార్తీక పూర్ణిమ

కార్తీక మాసంలో ప్రతిరోజుకు ఒక ప్రత్యేకత వున్నట్లే పూర్ణిమకు బహు విధాలైన విశిష్టతలున్నాయి. పూర్ణిమ నాడు చంద్రుడు షోడశకళారూపుడై శోభిస్తూ ప్రపంచాన్ని ఆహ్లాదపరుస్తాడు. భారతీయ సనాతన ధర్మాలలో పూర్ణిమకు ఎంతో విశిష్టత వుంది. ధ్యానానికి, ఆరాధనకు అనుకూలమైన యోగకాలం. చంద్రకళలు మనసుపై ప్రభావం చూపిస్తాయి. పరమాత్మను ఆరాధించడం వల్ల మనసు పవిత్రమై రసానందానుభూతి కల్గుతుందంటారు. అందుకే పూర్ణిమ నాడు ఆరాధనను, ధ్యానాన్ని విశేషంగా భావిస్తారు. కార్తీక మాసంలో వచ్చే పూర్ణిమ నాడు మానవులే కాక దేవతలు వ్రతాలు చేస్తారని పురాణాలు చెప్తున్నాయి. కార్తీక మాసంతో సమానమైన మాసం, వేదంతో సమానమైన శాస్త్రం, విష్ణువుతో సమానమైన దైవం, గంగతో సమానమైన తీర్థం లేవని శాస్త్ర వచనం. స్కంద, పద్మ పురాణాలలో వీటి వివరణలు వున్నాయి.

కార్తీక పౌర్ణమినాడు నమక, చమక, మహాన్యాస ఏకాదశ రుద్రభిషేకాలు చేస్తే శివుడు ప్రసన్నుడవుతాడని పురాణ కథనం. ఈ పూర్ణిమకే త్రిపుర పౌర్ణమి అనే పేరు వుంది. ఇది దీపాల పండుగ. పుచ్చు పువ్వులా వెన్నెల పూర్ణమై వుండే పున్నమి నాడు ఈ పండుగ జరగడం విశేషం. ఆరోజున మునిమాపు వేళ ఇళ్లలో, ఆలయాల్లో స్త్రీలు దీపాలు వెలిగిస్తారు. ఆనాడు మార్కండేయ పురాణం దానం చేస్తే పౌండరీక యజ్ఞం చేసినంత ఫలం లభిస్తుందంటారు. దీనికి సంబంధించి పురాణ గాధ ఒకటి ప్రచారంలో వుంది. పూర్వం త్రిపురులు అనే ముగ్గురు రాక్షసులు వుండేవారు. వారు భక్తి చేత శివుణ్ణి మెప్పించి శివుని చేత మరణం సంభవించేటట్లు వరాన్ని పొందుతారు. వారు ముగ్గురు రథాలలో తిరుగుతున్నప్పుడు ఒకే బాణంతో వారిని సంహరించాలన్నది త్రిపురాసుల కోరిక. ఈ వరం పొందిన వారు అటు దేవతలను, ఇటు మానవులను హింసిస్తుంటారు. వీరి బాధలు తట్టుకోలేక దేవతలు పరమేశ్వరుడిని వేడుకొన్నారు. ఆ రాక్షసుల కోరిక తీరేలాగా శివుడు భూమిని రథంగా, వేదాలను గుర్రాలుగా, శాస్త్రాలను కళ్లాలుగా, పురాణాలను రథపు మేకులుగా, సూర్యచంద్రులను రథచక్రాలుగా, విష్ణువును బాణంగా, వేయి తలలు గల వాసుకిని నారిగా చేసుకొని త్రిపురాసులను సంహరిస్తాడు. ఆ సంతోషంలో దేవతలు శివుణ్ని స్తుతిస్తూ ఆయనకు ప్రీతికరమైన దీపాలను వెలిగించారు. అందుకే దీనిని త్రిపుర పూర్ణిమగా పిలుస్తారు.

కార్తీక మాసం చలిరోజులు కాబట్టి పేదలకు వస్త్రదానం చేసినా, అన్నదానం చేసినా, ముత్తయిదువులకు ఫలదానం చేయడం వలన పుణ్యం లభిస్తుందంటారు. అలాగే చలిమిడి చేసి వాయనాలు ఇస్తారు. కార్తీక మాసంలో చేసే దానాలకు అంతటి రెట్టింపు ఫలం వస్తుందంటారు. పూర్ణిమ నాటి సాయంత్రవేళ దీప తోరణాలను పెట్టి కార్తీక దామోదరుడిని పూజించినా, తులసి కోటకు పూజ చేసినా సకల సౌభాగ్యాలు కల్గుతాయని పురాణాలు చెప్తున్నాయి. అందుకే పూర్ణిమ నాడు శివుడిని అర్చించి బంధుమిత్రులతో కలసి వన భోజనం చేస్తారు. స్కందపురాణంలో చెప్పినట్లు తత్వనిష్టోపాఖ్యానాన్ని, దేవదత్తోపాఖ్యానాన్ని, అంబరీషో పాఖ్యానాన్ని పారాయణం చేస్తారు. జ్యోతిషశాస్త్రరీత్యా మన:కారకుడు, పౌర్ణమి తిధికి అధిపతి చంద్రుడు. అలాంటి చంద్రునికి ప్రాధాన్యం కల్గిన కార్తీక పౌర్ణమి నాడు ఈ కార్యక్రమాలను నిర్వహిస్తే మానసిక ప్రశాంతత లభిస్తుంది. J



# ఘనంగా ముగిసిన రొట్టెల పండుగ!

నెల్లూరు నగరంలో నాలుగు రోజులపాటు జరిగిన రొట్టెల పండుగ ఘనంగా జరిగింది. మతసామరస్యానికి ప్రతీకగా నిలుస్తూ జాతీయ స్థాయిలో ప్రసిద్ధిగాంచిన రొట్టెల పండుగ 28వతేదీతో ముగిసింది. నగరంలో బారాషహీద్ దర్గా ప్రాంగణంలోని స్వర్ణాల చెరువు వద్ద ప్రారంభమైన రొట్టెల పండుగకి వివిధ రాష్ట్రాల నుంచి అధిక సంఖ్యలో భక్తులు తరలి వచ్చి మొక్కులు తీర్చుకున్నారు. దర్గాతో పాటు సమీపంలోని ప్రాంతాలన్నీ భక్తుల రాకపోకలతో కోలాహలంగా మారాయి. మృతవీరుల సమాధులను దర్శించుకొనేందుకు క్యూ కట్టారు. రొట్టెలు స్వీకరిస్తే తమ కోరికలు తీరుతాయన్న విశ్వాసంతో భక్తులు చెరువు వద్దకు చేరుకుని రొట్టెలు వదిలే వారి నుంచి స్వీకరించడం జరిగింది. ఆరోగ్యం, విద్య, సంతానభాగ్యం, సౌభాగ్యం, వివాహం, ఉద్యోగం తదితర రొట్టెలను భక్తులు వదలడం, స్వీకరించడం జరిగింది.

సోమవారం రాత్రి నిర్వహించిన గంధమహోత్సవం సందర్భంగా దర్గా వద్ద ప్రత్యేక ప్రార్ధనలు జరిపారు. కోటమిట్టలోని మసీదు ప్రాంగణం నుంచి ప్రత్యేకంగా తయారు చేయబడిన గంధపు బిందెలను ఊరేగింపుగా దర్గా వద్దకు చేర్చారు. కడప దర్గా పీఠాధిపతి ఆరిఫుల్లా హుస్సేన్ ఆధ్వర్యంలో ప్రార్ధన చేసి గంధాన్ని మృతవీరుల సమాధులకు పూశారు. ఈ గంధాన్ని స్వీరించేందుకు ఇక్కడకు వచ్చిన భక్తులు పోటీపడ్డారు. గతంలో కంటే భక్తులధికమవడంతో నగరంలో వాహనాల రాకపోకలకు అంతరాయం ఏర్పడింది. వివిధ ప్రాంతాల నుంచి నగరంలోకి వచ్చే వాహనాలకు ఎసి స్టేడియం, పోలీసు మైదానంలో పార్కింగ్ సదుపాయం కల్పించారు. మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు ముందస్తు ప్రణాళికతో ఏర్పాట్లు చేశారు. ఈ రొట్టెల పండుగకు వచ్చే భక్తులకు ఎలాంటి ఇబ్బందులు కలగకుండా ఏర్పాట్లు చేసినప్పటికీ తాగునీటి సరఫరాలో కొంత అంతరాయమేర్పడింది. తాత్కాలికంగా మరుగుదొడ్లు ఏర్పాటు చేసినప్పటికీ అవి భక్తుల అవసరాలకు ఏమాత్రం సరిపోక ఇబ్బంది పడాల్సి వచ్చింది. ఆర్టీసి వివిధ ప్రాంతాల నుంచి ప్రత్యేక బస్సులు సక్రమంగా నడపలేకపోయింది. దీంతో ఇక్కడకు వచ్చి తిరిగి వెళ్లేందుకు గంటల తరబడి ఆర్టీసి బస్టాండుల్లో నిరీక్షించక తప్పలేదు.



రొట్టెల పండుగ కమిటీ ఛైర్మన్ జకీర్ హుస్సేన్ స్వేచ్ఛగా పనిచేసే అవకాశం దొరకడంతో రేయింబవళ్లు శ్రమించి తనవంతు ఏర్పాట్లను చేశాడు. ఇక్కడ రొట్టెల పండుగలో పాల్గొన్న భక్తులు కసుమూరు, ఎఎస్‌పేట దర్గాలను సందర్శించారు. ఆయా ప్రాంతాల్లో కూడా భక్తుల రద్దీని దృష్టిలో పెట్టుకొని పోలీసు బందోబస్తు ఏర్పాటు చేశారు. J

# కేజ్రీవాల్ పగటి కలలు నిజమయ్యేనా?

**● అవినీతి అనే ఒకే ఒక అంశం మీద ప్రజలను కూడగట్టి అధికారంలోకి రావాలన్న కేజ్రీవాల్ కోరిక మనదేశంలో నెరవేరుతుందా?**




వానొచ్చే ముందు పుట్ట గొడుగులు పుట్టినట్లు, ఎన్నికలకు ముందు రాజకీయ పార్టీలు పుట్టుక రావడం మన దేశంలో సాంప్రదాయం. ఈసారి గడువుకంటే ముందే ఎన్నికల వాతావరణం ఏర్పడుతున్నది. అదేదో సినిమా పాటలో తొందరపడి కోయిల ముందే కూసినట్లు, రాజకీయ అశావహులు కూడా గడువుకంటే ముందే కొత్త పార్టీల కూనిరాగాలు ఆలపిస్తున్నారు. ఆ కోవకు చెందిన వాడే అరవింద్ కేజ్రీవాల్. సాధారణంగా రాజకీయాలలో బాగా మెలిగి, నలిగినవాళ్లు మాత్రమే పార్టీలు పెట్టడం మనం చూస్తూ వుంటాము. కేజ్రీవాల్ పోకడ అందుకు విరుద్ధం. రాజకీయాలలో ఓనామహాలు తెలియవాయనకు. నిన్న మొన్నటి వరకు ఆయనెవరో పక్కింటి వాడికి కూడా తెలిసే అవకాశం లేదు. దేశంలోని లక్షలాది మంది ప్రభుత్వ ఉద్యోగులలో అతడూ ఒకడు. ఇన్‌కంట్యాక్స్ డిపార్ట్‌మెంట్‌లో జాయింట్ కమిషనర్‌గా పని చేసేవాడు.

## సామాజిక స్పృహ జాస్తి!

యవ్వన దశ నుంచే కేజ్రీవాల్‌కు సామాజిక స్పృహ కొంచెం ఎక్కువ. ఖరగ్‌పూర్ ఐఐటిలో ఇంజనీ రింగ్ చదివి, టాటా కంపెనీలో ఉద్యోగానికి చేరిన ఆయన అక్కడ ఎక్కువ కాలం వుండలేకపోయాడు. మదర్ థెరిస్సా ఆశ్రమంలో కొంతకాలం, రామకృష్ణ మిషన్‌లో మరికొంతకాలం గడిపాడు. ఆ తర్వాత అదీ నచ్చక సివిల్ సర్వీసు పరీక్షలు వ్రాసి ఐఎఎస్ పాస్ కాలేక, ఇండియన్ రెవిన్యూ సర్వీసెస్ వరకు గట్టెక్కాడు. వెంటనే ఉద్యోగంలో చేరిపోయాడు. కానీ అక్కడా కాలు నిలవలేదు. ఉద్యోగంలో వుంటూనే పలు సేవా కార్యక్రమాలు ప్రారంభించాడు. ఢిల్లీలో పరివర్తన అనే స్వచ్ఛంద సంస్థ స్థాపించి, సాధారణ పౌరులు ఇన్‌కంట్యాక్స్, ఎలక్ట్రిసిటీ, సివిల్ సప్లయిస్ వంటి శాఖలకు సంబంధించిన సమస్యలపై పోరాడేందుకు చైతన్య కార్యక్రమాలు నిర్వహించేవాడు. ఆ తర్వాత దృష్టి సమాచార హక్కు చట్టం మీద పడింది. ఆ చట్టం ఆవశ్యకతను వివరిస్తూ ఢిల్లీ నగరంలో ప్రజా చైతన్యం కోసం ఎన్నో కార్యక్రమాలు నిర్వహించాడు. అది చట్టంగా మారిన తర్వాత, ఢిల్లీ మునిసిపల్ కార్పొరేషన్, ఇన్‌కంట్యాక్స్ డిపార్టుమెంట్, ఎలక్ట్రిసిటీ బోర్డు, సివిల్ సప్లయిస్ డిపార్టుమెంట్ వంటి వాటిలో అవినీతికి సంబంధించిన సమాచారాన్ని వెలుగులోకి తేవడానికి అసంఖ్యాకమైన సమాచార హక్కు దరఖాస్తులు సంధించాడు. ప్రజలూ దాన్నొక అస్త్రంగా వాడుకోవడం అలవాటు చేసుకొనేందుకు ఉద్యమం నడిపాడు. ఆ కృషి ఫలితంగా ఆయనకు ప్రతిష్టాత్మకమైన రామన్ మెగసెసే అవార్డు లభించింది. ఆ తర్వాత ఉద్యోగం వదలి అన్నా హజారేతో కలిసి జన్ లోక్‌పాల్ బిల్లు కోసం ఉద్యమం ప్రారంభించాడు. మహారాష్ట్రకే పరిమితమైన అన్నా హజారేను ఢిల్లీకి తీసుకవచ్చి, జాతీయ ప్రాధాన్యత కల్పించడంలో కేజ్రీవాల్ కృషి ఎంతో వుంది.

## సామాన్యుల గూర్చి తెలియదు

ఇంతే కేజ్రీవాల్ చరిత్ర. రాజకీయాలంటే కోట్లాది మంది ప్రజలతో కూడిన విషయం. వారితో కలగలుపుగా తిరిగి, వారి జీవితాలకు దగ్గరగా వెళ్లి, వారి సమస్యలను అర్థం చేసుకొని, వారికేమి కావాలో తెలుసుకొని, వారి భావోద్వేగాలతో భాగం పంచుకొనేవాడే రాజకీయాలలో మనుగడ సాగించ గలుగుతాడు. కేజ్రీవాల్‌కు అటువంటి వేవీ తెలియవు. ఆయన తిరిగిన, మెలిగిన సమాజం ఉన్నత వర్గాలకు, కొంతవరకు మధ్యతరగతి జీవితాలకు పరిమితమైనది. అవినీతిపై సమాచార హక్కు చట్టం క్రింద దరఖాస్తులు వ్రాయడం తప్ప మరొక ప్రజా సంబంధిత అంశంలో ఆయనకు అనుభవం లేదు. అసలు సంపర్కమే లేదు. ఓటర్లలో అధిక సంఖ్యాకులైన పేద ప్రజానీకం, గ్రామీణ ప్రజానీకం ఆయ

కొరవ 14వ పేజీలో

# వారఫలాలు

తేది 1-12-2012 నుండి 7-12-2012 వరకు వృషభంలో గురు, శుక్ర, శని, కేతువులు; తులలో బుధుడు 6తేది వరకు తదుపరి వృశ్చికంలో; వృశ్చికంలో రవి, రాహువులు; ధనుస్సులో కుజుడు; మిథున, కర్కాటక, సింహాలలో చంద్రుడు సంచరిస్తారు.



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

తలపెట్టిన పనులు వారాంతంలోపు పూర్తి చేయలేకపోతారు. భవిష్యత్ ప్రణాళికలు వేస్తారు. విలువగల వస్తువులు కొనుగోలు చేస్తారు. చిరకాలంగా వున్న ఆస్తి వివాదాలు పరిష్కారమౌతాయి. వృత్తి, ఉద్యోగ వ్యాపారాలలోనివారు ఆర్థికాభివృద్ధి సాధిస్తారు. కొన్ని వార్తలు లేదా సంఘటనలు మనస్తాపాన్ని కలిగిస్తాయి. విద్యార్థులు విద్యలో రాణిస్తారు. వ్యవసాయదారులు క్రమంగా పుంజుకొంటారు.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

వృత్తి, వ్యాపార, ఉద్యోగ, ఇతర రంగాలలోని వారికి ఆర్థికాభివృద్ధి మెరుగ్గా వుంటుంది. ఇతరుల నుండి అవసరానికి అన్నిరకాల సహాయ సహకారాలుంటాయి. కొత్త ఆలోచనలు అమలు చెయ్యటానికి ప్రయత్నిస్తారు. నూతన గృహనిర్మాణాది పనులు గూర్చి ఆలోచిస్తారు. విద్యార్థుల ప్రతిభాపాటవాలు వెలుగులోకి వస్తాయి. వ్యవసాయదారులకు ధనాదాయం. రాజకీయులకు సభలు, సన్మానాలుంటాయి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు1,2,3 పా

తలపెట్టిన పనుల్లో చిన్న చిన్న ఆటంకాలెదురైనా పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపార రంగాలవారు ఉత్సాహంగా తమ వృత్తులపై శ్రద్ధ వహిస్తారు. ఉద్యోగులకు తోటివారితోకానీ, పైవారితో కానీ మనస్పర్థలు రావచ్చు. విద్యార్థులు ఉత్సాహంగా, ఉల్లాసంగా వుంటారు. వ్యవసాయదారులు డబ్బు పొదుపుగా వాడటం మంచిది. కళా, క్రీడా రంగాలవారికి వృత్తి లావాదేవీలు ఆశాజనకంగా వుంటాయి.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

గతంలో కంటే అన్నివిధాల బాగుంటుంది. పనులన్నీ పూర్తి చేయగలుగుతారు. వృత్తి, వ్యాపారాలలోని వారు చేసే అభివృద్ధి పనులకు గుర్తింపు వస్తుంది. విద్యార్థుల ప్రయత్నాలు అనుకూలిస్తాయి. వ్యవసాయదారుల ప్రయత్నాలు ఫలిస్తాయి. ముఖ్య నిర్ణయాలు తీసుకొంటారు. కళా, క్రీడా రంగాల వారు కృషికి తగ్గ ఫలితాలు పొందుతారు. రాజకీయులకు ఈ వారం అనుకూలం.



**సింహం**
మఖ, పుబ్బ, ఉత్తర 1 పా

అన్ని పనులు సానుకూలిస్తాయి. ఆర్థికస్థితి మెరుగుపడుతుంది. గత కొద్దిరోజులుగా రగులుతున్న వివాదాలకు పరిష్కారం దొరుకుతుంది. కోర్టు వ్యవహారాలు వాయిదా కోరడం మేలు. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికస్థితి లాభసాటిగా వుంటుంది. ఇంట్లో అభిప్రాయభేదాలు రాకుండా జాగ్రత్త అవసరం. విద్యార్థులు చదువుపై శ్రద్ధ పెట్టాలి. వ్యవసాయదారుల ఆర్థికస్థితి మెరుగ్గా వుంటుంది.



**కన్య**
ఉత్తర 2,3,4పా, హస్త, చిత్తా 1, 2 పా

కుటుంబంలో కొన్నిరోజులుగా వున్న వ్యతిరేకత, వివాదాలలో నుండి క్రమంగా బయటపడతారు. వృత్తి, వ్యాపారాలలోని వారిని ఆర్థికసమస్యలు ఇబ్బంది పెడతాయి. విద్యార్థులకు తమ తోటి విద్యార్థులతో అకాల విరోధం రావచ్చు. సంతానవృద్ధికి సంబంధించి శుభవార్తలు వింటారు. కళా, క్రీడా రంగాలవారికి వృత్తిపరమైన ఉత్సాహం వుంటుంది. రాజకీయులు ముఖ్యమైన పనులు పూర్తి చేస్తారు.

## పంచాంగం

2తేది సంకష్టహర చతుర్దశి.

**శుభ ముహూర్తాలు**

1, 2, 5, 7తేదీలలో నవ వధూ గృహప్రవేశం, సీమంతం, అన్నప్రాసనాది, గర్భాధానం, వివాహ, నూతన గృహప్రవేశ శుభకార్యాలకు సముహూర్తాలున్నాయి.

**డిసెంబర్ తిథులు**

**కార్తీక బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 1 | శని | తదియ | రా | 03.05 గం.ల.వ |
| 2 | ఆది | చవితి | తె | 05.55 గం.ల.వ |
| 3 | సోమ | పంచమి | | పూర్తిగా |
| 4 | మంగళ | పంచమి | ఉ | 07.32 గం.ల.వ |
| 5 | బుధ | షష్ఠి | ఉ | 08.36 గం.ల.వ |
| 6 | గురు | సప్తమి | ప | 09.02 గం.ల.వ |
| 7 | శుక్ర | అష్టమి | ప | 08.46 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.



**తుల**
చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా

నూతన కార్యక్రమాలకు శ్రీకారం చుడతారు. చిన్ననాటి మిత్రులను కలుసుకొంటారు. మీ కీర్తిప్రతిష్టలు పెరుగుతాయి. ఇంట్లో శుభకార్యాల కోసం నూతన వస్తు, వాహన, వస్త్రాభరణాలను కొనుగోలు చేస్తారు. విద్యార్థులు ఈ వారం కాస్త వెనుకబడతారు. వ్యవసాయదారులకు అనుకొన్న సమయానికి పనులు పూర్తికావు. కళా, క్రీడా రంగాలలోని వారి ఆర్థికపరిస్థితి పరవాలేదనిపిస్తుంది.



**వృశ్చికం**
విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ

కుటుంబంలో ఏర్పడ్డ వివాదాలు క్రమంగా తొలగుతాయి. భార్యాభర్తల మధ్య సాన్నిహిత్యం పెరుగుతుంది. ఒక శుభవార్త మిమ్మల్ని సంతోష పెడుతుంది. ఆధ్యాత్మిక, ధార్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. వృత్తి, వ్యాపార రంగాలవారి ఆర్థిక ఇబ్బందులు తొలగుతాయి. ఆస్తి వివాదాలు తొలగి, కోర్టు వ్యవహారాలు అనుకూలిస్తాయి. విద్యార్థులు తోటివారితో వివాదాలకు పోవద్దు.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

చేసే పనులలో అభివృద్ధి కనపడుతుంది. అన్ని రంగాల వారికి ఆర్థికాభివృద్ధి ఆనందాన్నిస్తుంది. వృత్తి, వ్యాపార రంగాలు పుంజుకుంటాయి. నూతన కార్యక్రమాల గూర్చి ఆలోచనలు చేస్తారు. నూతన వ్యక్తుల పరిచయాలు, అభివృద్ధి అనుకూలతలను సాధిస్తారు. దూర ప్రయాణాలు చేస్తారు. వ్యవసాయదారులకు ఆర్థిక ఇబ్బందులు తొలగుతాయి. కళా, క్రీడా రంగాలవారికి వృత్తిపరంగా విజయం తథ్యం.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ట 1, 2 పా

తలపెట్టిన పనులు శుభాశుభమిశ్రమంగా వుండి అవసరానికి డబ్బు అందుతుంది. ఇంట్లో తలపెట్టిన శుభకార్య యత్నాలు ఫలిస్తాయి. కుటుంబ పరిస్థితులు మీకనుకూలిస్తాయి. మీ గౌరవం పెరుగుతుంది. వృత్తి, వ్యాపారాలలోని వారికి సామాన్య ఫలితాలుంటాయి. విద్యార్థులకు చదువుపై శ్రద్ధ అవసరం. వ్యవసాయదారులకు స్వల్పంగా లాభిస్తుంది. రాజకీయులు విదేశీ ప్రయాణాలు వాయిదా వేస్తే మంచిది.



**కుంభం**
ధనిష్ట 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

గతవారం కన్నా కొంత మెరుగ్గా వుంటుంది. కొన్ని పనులు సమయానికి పూర్తి చేస్తారు. క్రమంగా ఆర్థికాభివృద్ధి కనబడుతుంది. ఆధ్యాత్మిక కార్యక్రమాలలో పాల్గొంటారు. దూర ప్రయాణాల వల్ల ముఖ్య పనులు వాయిదా పడతాయి. విద్యార్థులు తోటి విద్యార్థులతో ఆనందంగా గడుపుతారు. వ్యవసాయదారులకు శారీరక శ్రమ అధికంగా వుంటుంది. రాజకీయులకు ఒకవార్త సంతోషాన్నిస్తుంది.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

ఆకస్మిక ధనలాభం. ప్రయత్న అనుకూలతలు సాధిస్తారు. తోటి వారితో చిన్నపాటి భేదాభిప్రాయాలు రావచ్చు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలో కొన్ని సమస్యలు ఎదురౌతాయి. కుటుంబ సమస్యలు బంధు మిత్రులతో చర్చకు రావచ్చు. శుభకార్యాలలో పాల్గొంటారు. వ్యవసాయదారులకు ఆర్థిక సమస్యలు తీరుతాయి. కళా, క్రీడా రంగాల వారు వృత్తిపరమైన అనుకూలతలు సాధిస్తారు.

# సృష్టికి ప్రారంభమేగాని అంతం లేదు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రీనగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*వై.తారాదేవి సికింద్రాబాద్*

* *యుగాంతం అనీ, ప్రళయం అనీ కొందరు పుస్తకాలు వేస్తున్నారు. ఇది జరుగుతుందా?*

సృష్టికి ప్రారంభమేకానీ అంతం లేదంటారు విశ్వామిత్ర మహర్షి, అలా పుస్తకాలు వేసి దైవాంశ సంభూతలమని చెప్పుకునేవారు నవ్వుల పాలయ్యారు.

*వి.జానకీశర్మ సర్వేపల్లి*

* *ఆర్థికమైన సమస్యలు ఆకస్మికంగా ఏర్పడ్డాయి. నా జాతకం పంపిస్తున్నాను.*

లగ్నాధిపతి అంగారకుడితో మమేకం(సఖ్యత) కావడం వల్ల ఇలా జరుగుతుంది. శాస్త్ర పరిష్కారాలున్నాయి. నిష్ణాతులైన సిద్ధాంతిని కలవండి.

*వి.శ్రీరామ్మూర్తి నెల్లూరు*

* *గృహ ప్రారంభం తర్వాత సమస్యలు ఎక్కువయ్యాయి?*

ప్లాను చూశాను. వాస్తు దోషాలు లేవు. జాతకరీత్యా మాత్రమే మీకు సమస్యలు ప్రారంభమయ్యాయి. శాస్త్రాధ్యయనం చేసిన వారికి పాఠాలు చెప్పే స్థాయిలో మీరే లేరని గుర్తిస్తే మంచిది.

*ఎన్.కుమారి విజయవాడ*

* *వివాహాది శుభకార్యాలలో దోష యుక్తమైన తిథులకు పరిష్కారాలు ఉంటాయా?*

ఈ దోషాల్ని 'పక్షచ్ఛిద్ర' దోషమని శాస్త్రజ్ఞులు వివరించారు. గ్రహబలం అత్యధికంగా ఉన్నప్పుడు మాత్రమే ఈ దోషాలు హాని కలిగించవు.

*పి.జగన్మోహనరావు సూళ్లూరుపేట*

* *వధూవరుల నక్షత్రం 'మఘ' అవుతున్నది. దోషం లేదా?*

శ్రవణ, రోహిణి, మఘ నక్షత్రాలలో వధూవరులది ఏక నక్షత్రమైనా దోషం లేదు.

*హెచ్.సుబ్బలక్ష్మి కోవూరు*

* *నిత్యం అనారోగ్యం పీడిస్తున్నది. ఏమి చేయాలి?*

యంత్ర, నవరత్న ధారణ వల్ల కొంత ప్రయోజనం ఉంటుంది. ఫలితాల్ని గృహంలో అవాస్తు దోషాలు సరిచేసుకోవాలి.

*డి.వెంకటాచార్యులు తిరుమల*

* *వాస్తు శాస్త్ర అధ్యయనానికి తెలుగులో ప్రామాణిక గ్రంథాన్ని సూచిస్తారా?*

మామిడేల శ్రీరామమూర్తిగారి గ్రంథం గృహవాస్తు సర్వస్వం మీరు చదువదగిన గ్రంథం.

*కె.దశరథ్‌రెడ్డి మొగళ్లూరు*

* *ప్రాప్తాన్ని బట్టే ఏదైనా జరుగుతుందా?*

హిందూ ధర్మశాస్త్రాలు, సర్వజ్ఞులైన మహర్షులు, అనుభవజ్ఞులైన గృహస్థులు చెబుతున్నదిదే. మీకు గడ్డు రోజులు ప్రారంభమైన మాట వాస్తవమే. గురువుకు హితబోధ చేసే స్థాయిలో మీరున్నారంటారా?

*ఆర్.దామోదర్‌రెడ్డి నెల్లూరు*

* *అనుభవజ్ఞుడైన శాస్త్రవేత్త వాస్తు చూశారు. సమస్యలు ఒక్కటొక్కటే ఎదురు పడుతున్నాయి.*

మీరొక పాత యింటిని రీమోడల్ చేసి చేశారన్న సంగతిని మర్చిపోకండి. ట్రైల్ పిట్స్‌వేసి నేలలో వెంట్రుకలు, ఎముకలు ఉన్నాయేమో చూడండి. శల్యవేధ మహాబాధ అని శాస్త్రాలు చెబుతున్నాయి.

*వి.రాజారెడ్డి సికింద్రాబాద్*

* *శుభకార్యక్రమాలకు అందరూ 'రాబందులై' పోతున్నారు.*

కళ్యాణ మండప వాస్తును బట్టి గృహస్థుకు కొన్ని ప్రభావాలు తప్పవు. బ్రహ్మ స్వరూపులు కూడా ఆశబోతులు కావడం దురదృష్టకరం. గతం, గతః మర్చిపోండి.

*సి.అనుమారెడ్డి చెన్నై*

* *కళ్యాణ మండపాల ప్రభావం వధూవరులపై ఉంటుందా?*

మీ సిటీలోని ఒకటి రెండు కళ్యాణ మండపాలపై ఈ అపవాదు ఉంది. వాటిలో దిక్కులు లోపించడం. దైవ విగ్రహ ప్రతిష్ట లేకపోవడం ఇందుకు కారణం కావచ్చు.

*డి.నారాయణరావు గుంటూరు*

* *ఆర్థిక, ఆరోగ్య పరిస్థితులు అస్తవ్యస్తంగా మారాయి. కారణమేమిటి?*

తూర్పు(ఇంద్ర), ఉత్తర(కుబేర) స్థానాలు దోషభూయిష్టమైనపుడు ఈ పరిస్థితి ఏర్పడుతుంది. నిర్ధారించబడిన యంత్ర ప్రతిష్టల వల్ల సమస్యల చిక్కుముడి వీడిపోతుంది.

# తృతీయవర్ధంతి







జననం
09-09-1928



మరణం
05-12-2009

## శ్రీమతి గునుపాటి లక్ష్మీకాంతమ్మ గారు

( స్వర్గీయ గునుపాటి రామచంద్రారెడ్డి గారి ధర్మపత్ని)

తృతీయ వర్ధంతి (05-12-2012) సందర్భంగా వారిని
స్మరించుకొంటూ...

## కుటుంబ సభ్యులు

# విద్యాబాలన్ హనీమూన్!



ద డర్టీ పిక్చర్స్‌తో ఎంతో కీర్తి గడించిన హీరోయిన్ విద్యాబాలన్ త్వరలో పెళ్లి కూతురు కాబోతోంది. ఆమె ప్రియుడు సిద్ధార్థరాయ్ కపూర్‌తో ఏడడుగులు వేసేం దుకు మంచి సుముహూర్తం కోసం ఎదురు చూస్తోంది. ప్రస్తుతం గచ్‌చక్కర్ సినిమాతో బిజీగా ఉన్నానని అది పూర్తికాగానే పెళ్లి చేసుకొంటానంటుంది విద్యాబాలన్. హనీమూన్‌కు కూడా విద్యాబాలన్ ప్రణాళిక సిద్ధం చేసింది. కరేబియన్ దీవులైతే బాగుంటుందని విద్యా బాలన్ చెప్పింది. పెళ్లి తర్వాత నటించరా అంటే; పెళ్లి, ఆతర్వాత జీవితం అనేది నా చేతుల్లో లేని విష యం. వివాహమైతే సినిమాకు దూరం కావాల్సిన అవ సరం లేదు. ఈ రంగంలో నేను సాధించాల్సింది చాలా ఉందని చెబుతోంది విద్యాబాలన్.

# లారాదత్తా దర్శకత్వం



మహేష్ భూపతిని పెళ్లి చేసు కొని సంసార జీవితాన్ని గడుపుతోన్న లారాదత్తాకు సినిమాలపై మనసు మళ్లింది. నటిగా కాదు లెండి... సాంకే తిక నిపుణురాలిగా, ఓ దర్శకురాలిగా తన ప్రతిభ బయట పెట్టాలని ఎదురు చూస్తోంది. సినిమా రంగంలోకి అడు గుపెట్టిన వారంతా కెప్టెన్ కుర్చీలో ఒక్క సారైనా కూర్చోవాలని తహతహలాడి పోతుంటారు. దర్శకత్వం అనేది చాలా బరువైన బాధ్యత. కానీ ఛాలెంజింగ్‌గా అనిపిస్తుంది. నాకు మెగాఫోన్ పట్టా లనే ఆశ ఉంది. ఈ విషయం మా వారికి కూడా చెప్పేశా. ఆయన సహకా రం ఉంటుందని భావిస్తున్నా. అయితే ఆ సినిమా ఎప్పుడో చెప్పలేను. ఎందు కంటే ఇక్కడ ఎన్ని ప్రణాళికలు వేసు కొన్నా అదృష్టం కలిసి రావాలి. లేదంటే ఏమీ చెయ్యలేమంది.

# అందరూ స్నేహితులే!



తమిళనాట చిన్న ఖుష్బూగా ప్రేక్షకుల ప్రశంసలు అందుకొన్న హీరోయిన్ హన్సిక చేతిలో ప్రస్తుతం ఏడు చిత్రాలున్నాయి. మీ చేతిలో ఇన్ని సినిమాలున్నా యని ఇతర హీరోయిన్ ఈర్ష్యపడరా అని ఆమెను అడిగితే సమాధానంగా మీరనుకొంటున్నట్టుగా మా మధ్య అలాంటి వాతావరణం అస్సలు ఉండదు. నాతోటి హీరోయిన్లందరితోనూ నేను స్నేహ పూర్వకంగా మెలుగుతుంటాను. కాజల్, తమన్నా నాకు మంచి స్నేహితులు. ఒకరికొకరు అన్ని విషయాలు పంచుకొంటుంటాం. ఇటీవల తమన్నా నాకు ఫోన్ చేసి చాలాసేపు మాట్లాడింది. ఇక్కడ ఎవరు చేయాల్సిన పాత్రలు వాళ్లకు దక్కుతుంటాయంతే. ఈర్ష్య, అసూ యలకు ఏమాత్రం చోటు లేదంది.

# ఐటెమ్ పాటలు చేయను!



డబ్బు ముఖ్యమే. కానీ పచ్చ నోటు కోసం నా మనస్సాక్షికి వ్యతిరేకంగా నడుచుకో లేనంటోంది హీరోయిన్ అమీషాపటేల్. బాలీ వుడ్‌లో ఇప్పుడు ప్రత్యేక గీతాలకు గిరాకీ బాగుంది. క్రేజ్ తగ్గిన హీరోయిన్లు మళ్లీ వెలుగు లోకి రావడానికి ప్రత్యేక గీతాలనే ఆశ్రయిస్తున్నారు. అమీషాకు ఇటువంటి అవకాశాలు వచ్చాయి. కానీ వీటికి ఆమె నో చెప్పింది. మసాలా పాటలంటే నాకు ముందు నుంచీ ఇష్టం లేదు. వాటిని చేస్తే నాలుగు డబ్బు లొస్తాయేమో గానీ, నలు గురిలో గర్వంగా చెప్పుకోలేం. కెరీర్ కాస్త నెమ్మదిగా సాగినా పర్లేదు. పేరు తెచ్చే పాత్రలే చేస్తా అని తెగేసి చెబుతుంది.

# అవకాశమిస్తేగా...



కృష్ణం వందే జగద్గురుమ్ చిత్రంలో ఐటమ్‌పాటలో నర్తించింది సమీరారెడ్డి. గ్యాప్‌లో పిచ్చాపాటీగా మాట్లాడుతూ తెలుగు సినిమా అంటే నాకు విముఖత ఏమీ లేదు. నిజం చెప్పాలంటే నాకు తెలుగులో మంచి అవకాశాలు రావడం లేదు. పైగా బాలీవుడ్‌లో నేను ఒప్పు కొన్న సినిమాలతో నాకు తీరిక లేదు. మధ్యలో తమిళంలో వేట్టై లాంటి చిత్రాలు చేశాను. అందుకే తెలుగు సినిమాల్లో ఈ మధ్య కనిపించడం లేదు. ఎలాగైతే నేం... కృష్ణం వందే జగద్గురుమ్‌తో మళ్లీ మెరిసే అవకాశం వచ్చిందంది.




✍ అల్లూరు రహీం

వాయిదాల మీద వాయిదాలు పడుతూ ఎట్ట కేలకు 23వ తేది విడుదలైన డమరుకం చిత్రం మొత్తానికి పరవాలేదనిపించింది. ఈ చిత్రం తీయడానికి చిన్న దర్శకుడు శ్రీనివాసరెడ్డి పడిన కష్టం ప్రతి ఫ్రేమ్‌లోనూ కనిపించింది. సోషియోఫాంటసీ కథతో సాగే ఈ చిత్రంలో లోకల్‌గా చేసిన గ్రాఫిక్స్ పనితనంలో రాక్షసుడు అంధకాసురుడి స్థావరం, హీరో కుటుంబంపై వింత జంతువు దాడి, శివుని ప్రత్యక్షం, నందీశ్వరుని రంకె, అనుష్కపై అఘోరాల దాడి, రాక్షస కోట సృష్టి వంటివి చిత్రం చూస్తున్న ప్రేక్షకులను రోమాంచితులను చేస్తాయి. వీటికితోడు కథ, కథనం, సంగీతం, పాటలు నటీనటుల నటన కలగలిపి డమరుకాన్ని ఢమ ఢమ లాడించాయి. వెలి గొండ శ్రీనివాస్ వ్రాసిన కథకు కనీసం డజను మంది రచయితలు మెరుగులు దిద్దారు. తన 50వ చిత్రంగా డమరుకానికి సంగీతం సమకూర్చిన దేవిశ్రీ ప్రసాద్ – ఏయ్ సక్కుబాయ్, కన్యాకుమారి, నేస్తమా చరణ లతో సాగే పాటలకు జనరంజకమైన బాణీలను అం దించాడు. పాటలను దర్శకుడు శ్రీనివాస్‌రెడ్డి చాలా బాగా చిత్రీకరించాడు. చోటాకె.నాయుడు కెమెరా పనితనాన్ని ఈ చిత్రంలో ప్రత్యే కంగా చెప్పుకోవాలి. నటీనటుల్లో రాక్షసుడు అంధకాసురుడి పాత్ర పోషించిన రవిశంకర్‌కు మొదటి మార్కులు వేయాలి. ఆయన ఆంగి కం, అభినయం అద్భుతం. అంధ కాసురుడు ఆవహించే రాహుల్ పాత్రను గణేష్ బ్రహ్మాండంగా పోషిం చాడు. ఈ చిత్రంలో ప్రేమి కులుగా నాగార్జున, అనుష్క చాలా అందంగా కనిపిం చినా శివునిగా ప్రకాష్‌రాజ్ ప్రత్యేకంగా ఆకట్టుకొం టాడు. శ్రీనివాస్‌రెడ్డి మార్కు కామెడీ ఈ చిత్రంలో పెద్దగా పేలలేదు. అంధకా సురుడి నెత్తిపై పాముల పుట్ట భయంకరంగా ఉంది. ఈ సన్నివే శాన్ని చూడను మహిళలు, పిల్లలు భయపడాల్సి వస్తుంది. ఈ చిత్ర నిడివి ఇంకాస్త తగ్గితే బాగుండేది. దర్శకుడే వ్రాసిన మాటల్లో శవం... శివం, బాలుడే వీరుడు, మజారే... మజా వంటి సం క్షిప్త డైలాగులు అలరిస్తాయి. హీరో మాటిమాటికీ డర్టీపిక్చర్ చూపిస్తానని డైలాగు పలకడం ఏమంత బాగోలేదు.




చిత్ర కథలోనికివెళ్తే దేవదానవ సంగ్రామంలో హతం కాకుండా మిగిలిన ఏకైక అసురుడు అంధకా సురుడు(రవిశంకర్), మరో రాక్షస గురువు మాయి (జీవా)తో కలిసి కొన్నివేల ఏళ్ల పాటు ఓ నిర్జన ప్రదే శంలో తలదాచుకొంటారు. ప్రకృతిలో విచిత్రంగా చోటుచేసుకొనే పంచగ్రహ కూటమి సమయాన విశ్వ నాథం(దేవన్) ఇంట మహేశ్వరి(అనుష్క) పార్వతీదేవి అంశతో జన్మిస్తుంది. ఈమెను పెళ్లి చేసుకొంటే 14 లోకాలను శాసించవచ్చనే దుర్బుద్ధితో అంధకాసు రుడు కళ్లు తెరుస్తాడు. శివుడు(ప్రకాష్‌రాజ్)ను మెప్పిం చను ఘోర తపస్సు చేసి మహేశ్వరిని చేజిక్కించు కునే క్రమంలో ఎవ్వరూ అడ్డుపడకుండా వరం కూడా పొందుతాడు. లోకకళ్యాణార్థం, మహే శ్వరిని పెండ్లాడను జన్మించిన మల్లికార్జున (నాగార్జున), అతని కుటుంబం భవిష్యత్తులో తనకు అడ్డురాకుండా ఉండను కాశీకి వెళ్లి వస్తుండగా వాళ్లను అంతమొందిస్తాడు. కానీ అఘోరాలు మల్లికార్జునను కాపాడుతారు. తమ కుటుంబాన్ని తనలో ఐక్యం చేసుకొన్న శివుణ్ని మల్లికార్జున నిత్యం నిందిస్తుంటాడు. మహేశ్వరి(అనుష్క) డాక్టర్. మంచం పట్టి ఉండే మల్లి కార్జున చెల్లికి అమ్మఒడి ఆశ్రమంలో వైద్యమందిస్తుం టుంది. కాస్త కెమిస్ట్రీ జరిగాక మల్లి, మహేశ్వరిలు ఇష్టపడతారు. ఈ సమయంలోనే అమెరికా నుంచి మహేశ్వరి బావ మహి(గణేష్) ఇండియా వస్తాడు. అతణ్ని విమానాశ్రయంలో అంధకాసురుడు ఆవహి స్తాడు. ఇక్కడ నుంచి మహేశ్వరిని సొంతం చేసుకోను మానవుడైన మల్లికార్జున, అసురుడైన అంధకాసు రుడి మధ్య పెద్ద యుద్ధం జరిగి అంతిమంగా శివుని సహకారంతో మల్లికార్జున గెలవడంతో చిత్రం ముగు స్తుంది.

రొటీన్‌కు భిన్నమైన చిత్రాన్ని చూడాలనుకొనే వారు కుటుంబ సమేతంగా డమరుకానికి వెళ్లొచ్చు.



# నిధులు వచ్చినవెల్లా చప్పరించేస్తున్నారు!

**• రిజిస్ట్రార్ దగ్గర చక్రం తిప్పుతున్న విఆర్‌సి పి.డి**

నెల్లూరులో ఏర్పాటైన విక్రమ సింహపురి యూనివర్శిటీకి పూర్తిస్థాయిలో భవనాలు, వసతి సౌకర్యాలు ఏర్పాటు కానప్పటికీ అక్రమాలు మాత్రం ఇతర యూనివర్శిటీలు ఆశ్చర్యపోయే రీతిలో జరుగుతున్నాయి. యూనివర్శిటీలో చక్రం తిప్పే ఒక అధికారి అన్నీ తానై వ్యవహరించడం, ఆయనకు విఆర్ కళాశాలలో పని చేసే కొందరు పక్కన బృందంగా ఏర్పడి అందినంత దోచుకతినడంతో కోట్లాది రూపాయల నిధులు దుర్వినియోగం జరిగినట్లు సమాచారం. కొత్తగా ఏర్పాటైన యూనివర్శిటీకి మొదట వైస్‌ఛాన్సలర్‌గా వ్యవహరించిన వ్యక్తి నీతి, నిజాయితీపరుడు కావడం, అన్నీ పనులకు రిజిస్ట్రార్ మీద ఆధారపడడంతో ఆ వ్యక్తి అక్రమాలు, అవినీతికి తెర తీశాడట. చిత్తూరుజిల్లాకు చెందిన ఆయన అధ్యాపకుల నియామకాలు మొదలు అన్నింట్లో తానే కీలకంగా వ్యవహరించి అయినవాళ్లకు, బంధువులకు పెద్దపీట వేసినట్లు తెలుస్తోంది. కంప్యూటర్ల కొనుగోలు, క్రీడా పోటీల నిర్వహణ, పరీక్షల నిర్వహణ, ఫీజుల వసూళ్లు ఇలా ప్రతి దాంట్లోనూ అవకతవకలు జరిగినట్లు సమాచారం. 2011-12 సంవత్సరానికి సంబంధించి యూనివర్శిటీ నిర్వహించిన ఇండోర్ టోర్నమెంట్స్ ఒక్కరోజు నిర్వహణకు అక్షరాలా 16 లక్షల రూపాయలు ఖర్చు చూపారట. ఇది విని యూనివర్శిటీ పరిధిలోని పలువురు అధ్యాపకులు, క్రీడాకారులు ఆశ్చర్యపోయారు. ఇక నాలుగు కంప్యూటర్లకు ఇంటర్నెట్ కనెక్షన్ కోసం 35 లక్షల రూపాయలు చెల్లించారట. ఉన్నతాధికారులు తమ ఇష్టానుసారంగా నిధులు దుర్వినియోగం చేస్తుంటే, మరో వైపు విద్యార్థుల పరిస్థితి దారుణంగా వుంది. మిగతా యూనివర్శిటీల కంటే అధికంగా ఫీజులు వసూలు చేస్తున్నా ఇక్కడ విద్యార్థులకు కనీస సౌకర్యాలు లేవు. వెయ్యిమంది పైగా విద్యార్థులు వివిధ కోర్సులలో చదువుకొంటున్నారు. యూనివర్శిటీలో భవన నిర్మాణం జరగకపోవడంతో తాత్కాలికంగా విఆర్ హైస్కూల్ మిద్దెపైన తరగతులను నిర్వహిస్తున్నప్పటికీ దానికి తగినట్లు ఏర్పాట్లు చేయకపోవడంతో విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. అధ్యాపకులు తగినంత మంది లేక, సక్రమంగా విద్యాబోధన జరగక యూనివర్శిటీలో ఎందుకు చేరామా అని బాధపడుతున్నారు విద్యార్థులు. మరోవైపు పాత రిజిస్ట్రార్‌కు, ఇతరుల నడుమ అవినీతి పంపకాల్లో వివాదం నెలకొనడంతో ఆయన బదలీపై వెళ్లిపోయాడు. మొత్తం మీద పేరు గొప్ప ఊరు దిబ్బలా మారింది యూనివర్శిటీ వ్యవహార శైలి.

• అస్తవ్యస్తంగా

## ఆధార్ కార్డుల తీత!



విమర్శల పాలవుతున్న ఆధార్‌కార్డుల నమోదు.

ఆధార్ కార్డుల జారీ అస్తవ్యస్తంగా మారింది. నగరంలో సండేమార్కెట్ వద్ద గల అనిల్ బిల్డింగ్స్‌లో ఆధార్ కార్డులు తీసేందుకు ఏకైక కేంద్రాన్ని ఏర్పాటు చేయడంతో జనం బారులు తీరుతున్నారు. దరఖాస్తుల కోసం పొద్దుటి నుంచి నిరీక్షించేవారి సంఖ్య అధికంగా వుంటోంది. నగరంతోపాటు వివిధ ప్రాంతాల నుంచి ఆధార్‌కార్డుల కోసం వచ్చేవారు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. నెలరోజులకు ముందు దరఖాస్తులు ఇస్తుండడంతో వాటి కోసం ఈ కేంద్రానికి విరివిగా వస్తున్నారు. అయితే అక్కడి సిబ్బంది ఉదయం మాత్రమే దరఖాస్తులు ఇచ్చి, మధ్యాహ్నం నుంచి వాటిని అందజేయకపోతుండడంతో అది తెలియక దూర ప్రాంతాల నుంచి వ్యయప్రయాసలకోర్చి వచ్చే వారికి నిరాశ ఎదురౌతోంది. నవంబర్ 6తేది డిసెంబర్ 6తేది ఆధార్‌కార్డుల ఫోటోలు తీసేందుకు దరఖాస్తులు అందజేశారు. ఇక ఆ తర్వాత వచ్చే వారికి వీటిని అందజేయడం లేదు. ఇది తెలియక చాలామంది ప్రజలు ఇక్కడకొచ్చి సిబ్బంది మాటలు విని తిట్టుకుంటూ వెనక్కుపోతున్నారు. మరోవైపు దరఖాస్తులు అందజేయడంలోనూ ఈ కేంద్రం సిబ్బంది అవినీతికి పాల్పడుతున్నారనే ఆరోపణలు వ్యక్తం అవుతున్నాయి. ఒక్క దరఖాస్తుతోపాటు ఎవరైతే వంద రూపాయలకు తక్కువ కాకుండా ఇస్తారో అలాంటి వారి దరఖాస్తులను వెంటనే తీసుకొని వారి ఫోటోలు తీసి పంపిస్తుండడంతో సామాన్యులు రోజుల తరబడి తిరగాల్సిన పరిస్థితులు ఎదురౌతున్నాయి. దీంతో ఈ కేంద్రంలో అక్కడి సిబ్బందికి, ప్రజలకు మధ్య వాదోపవాదాలు జరుగుతున్నాయి. అధికారులు ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యను దృష్టిలో వుంచుకొని ఆధార్ కార్డుల జారీ ప్రక్రియలో ఇబ్బందులు తలెత్తకుండా మరొక కేంద్రాన్ని ఏర్పాటు చేయాల్సిన అవసరం ఎంతైనా వుంది.

*• 3 గ్రాముల వెండితో*

## బారాషహీద్ దర్గా నమూనా!



ముసవ్విర్ రూపొందించిన బారాషహీద్ దర్గా నమూనా.

నెల్లూరులోని బారాషహీద్ దర్గా, అక్కడ జరిగే రొట్టెల పండుగ మత సామరస్యానికి ప్రతీక అని ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు. రొట్టెల పండుగను పురస్కరించుకొని నెల్లూరీయుడు, సూక్ష్మ కళారూపాల రూపకర్త ముసవ్విర్ మూడు గ్రాముల వెండితో బారాషహీద్ దర్గా నమూనాను రూపొందించాడు. ఈ నమూనా ఒక అంగుళం ఎత్తు, ఒక అంగుళం పొడవుంది. మూడు రోజుల కాల వ్యవధిలో ముసవ్విర్ దీన్ని తయారు చేశాడు. బంగారంతో కళాఖండాలు చేస్తుండిన ముసవ్విర్ ఆర్థిక అవరోధాల వల్ల వెండితో బారాషహీద్ దర్గాను రూపొందించినట్లు 'జమీన్‌రైతు' ప్రతినిధికి చెప్పాడు.

## ట్రాఫిక్ పోలీసులకు సుస్తీ!

**నగర ట్రాఫిక్ నడతలో కానరాని మార్పు**

నగరంలో ట్రాఫిక్ అస్తవ్యస్తంగా ఉంది. రోడ్లు వెడల్పు జరగకపోవడం, పార్కింగ్ స్థలాలు లేకపోవడంతో ట్రంకురోడ్డులో నడవాలంటేనే కష్టంగా మారింది. మహా నగరాల్లో మాదిరి గంటల తరబడి ట్రాఫిక్ స్తంభించిపోతుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ట్రాఫిక్‌ను చక్కదిద్దాల్సిన ట్రాఫిక్ పోలీసులు మామూళ్ల దండుకోవడంలో తలమునకలై వుండడంతో పట్టించుకొనేవారే లేకుండాపోయారు. నగరంలో ఇరువురు ట్రాఫిక్ సిఐలు వున్నారు. నార్త్, సౌత్ ప్రాంతాల్లో ట్రాఫిక్‌ను చక్కదిద్దే బాధ్యత వీరిమీదుంది. వీరితోపాటు ట్రాఫిక్ ఎస్ఐలు, కానిస్టేబుళ్లు వున్నప్పటికీ ఎవరికి వారే యమునాతీరే అన్నచందంగా వ్యవహరిస్తుండడంతో ట్రాఫిక్ అస్తవ్యస్తంగా మారింది. కూరగాయల వ్యాపారులు, ఆటోవారి వద్ద, ఆత్మకూరు బస్టాండ్ నుంచి కోవూరు, బుచ్చి ప్రాంతాల్లో తిరిగే పెద్ద ఆటోల వద్ద నుంచి మామూళ్లు తీసుకోవడంలో వున్న శ్రద్ధ ట్రాఫిక్ క్రమబద్ధీకరణ పట్ల లేకపోవడంతో అడుగడుగునా వాహనాలు నిలిచిపోతున్నాయి. ట్రాఫిక్ పోలీసుల పనితీరు ఆ శాఖ ఉన్నతాధికారులకు ప్రత్యక్షంగా తెలిసి వచ్చింది. ఎఎస్‌పి చంద్రశేఖర్ పోలీసుల పని తీరును పరిశీలించేందుకు నగరంలో వివిధ స్టేషన్లు తనిఖీ చేసినప్పుడు విధులకు హాజరుకాని పోలీసులను చూసి ఆశ్చర్యపోయారు. ట్రాఫిక్ పోలీసు స్టేషన్‌కు వెళ్లగా అక్కడ వుండాల్సిన సౌత్, నార్త్ ట్రాఫిక్ సిఐలు రమేష్‌రెడ్డి, వెంకటేశ్వర్లు ఇరువురు 11 గంటలకూ రాకపోవడం, స్టేషన్ తాళాలు తీయకపోవడంతో అరగంటపాటు ఎఎస్పీ నిరీక్షించాల్సి వచ్చింది. దీంతో ఆయన వారికి ఫోన్ చేసి అగ్గిమీద గుగ్గిలమయ్యారు. స్వయంగా ట్రాఫిక్ పోలీసుల తీరు చూసిన ఎఎస్పీకి నోటమాట రాలేదు. ఆలస్యంగా సమాచారం అందుకొని ఇద్దరు సిఐలు ఉరుకులు, పరుగుల మీద అక్కడకు వచ్చారు. కూరగాయల మార్కెట్ వద్ద రోడ్డు ప్రక్కన బుట్టలు పెట్టుకొని వ్యాపారాలు చేసుకొనే వారిపై ట్రాఫిక్ పోలీస్ దౌర్జన్యం పెరగడం విమర్శలకు దారితీస్తుంది.

## ప్రేమ్‌సాగర్‌రెడ్డి దాతృత్వం



ప్రవాస భారతీయుడు ప్రేమ్‌సాగర్‌రెడ్డి దాతృత్వంతో డికె కాలేజీలో నిర్మిస్తున్న అదనపు గదులు.

నగరంలోని డికె ప్రభుత్వ మహిళా కళాశాలలో అదనపు గదుల నిర్మాణానికి తన వంతు సహకారం అందిస్తున్నారు అమెరికాలో స్థిరపడిన డాక్టర్ ప్రేమ్‌సాగర్‌రెడ్డి. నిడిగుంటపాళానికి చెందిన ఆయన జన్మభూమిని మరువక ఇప్పటికే పలు అభివృద్ధి కార్యక్రమాలకు భూరి విరాళాలను అందించి ఉన్న ఆయన తాజాగా కళాశాలలో అదనపు గదుల నిర్మాణానికి 60 లక్షల రూపాయల విరాళాన్ని ప్రకటించారు. ఈ మొత్తంతో ఐదు అదనపు గదులను నిర్మిస్తున్నట్లు బంధువైన పైమాఘం సుగుణాకర్‌రెడ్డి తెలిపారు. మమతా నర్సింగ్ హోమ్ నిర్వాహకుడు బద్దెవోలు శ్రీహరిరెడ్డి ఆధ్వర్యంలో శ్రీభారత్ బిల్డర్స్ చలపతి పర్యవేక్షణలో గదుల నిర్మాణం జరుగుతున్నాదని, త్వరితగతిన వీటిని పూర్తి చేసి కలెక్టర్ చేతులమీదుగా ప్రారంభించనున్నట్లు తెలిపారు.

## సం'కుల' సమరం

మొదటి పేజీ కొరవ

తారుమారైపోతుంది. ప్రభుత్వాల ఏర్పాటులో తన ప్రమేయం తగ్గిపోతుంది. దానితో మరొక ఐదేళ్ల పాటు ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని పంటి బిగువున నడపవలసి వస్తుంది. అది చాలా కష్టమైన విషయం.

మరొకప్రక్క తక్కువ సంఖ్యలో సీట్లు వస్తే, గతంలో వైఎస్ వలె, జగన్ కూడా తన ఎమ్మెల్యే లను టోకున కొనుగోలు చేసే ప్రమాదం వుంది. వైఎస్ ముఖ్యమంత్రిగా వున్నప్పుడు 11 మంది టిఆర్ఎస్ ఎమ్మెల్యేలను కొనుక్కొన్నాడు. ఇప్పటితరం ఎమ్మెల్యేలకు పదవి అంటే, పనుల కోసం, పైసల కోసం తప్ప ప్రజల కోసం కాదన్న నిజం అందరికీ తెలుసు. అధికారం ఎటు వుంటే అటు గోడ దూకడా నికి చాలామంది సిద్ధంగా వుంటారు. నీతి నియ మాలు, కట్టుబాట్లు వారికి వుండవని ఎన్నోసార్లు రుజువైంది. ఆ ప్రమాదం తప్పించుకోవాలంటే తెలం గాణలో జగన్‌ను నిలువరించాలి.

మహబూబ్‌నగర్, నల్గొండ, రంగారెడ్డి, హైద రాబాద్ జిల్లాలలో తెలంగాణ వాదన అంత బలంగా లేదన్న భావన ఒకటి వుంది. ఈ ప్రాంతాలలోనే జగన్‌కు ఎక్కువ ఆదరణ లభిస్తున్నది. మజ్లిస్ పార్టీ కూడా జగన్‌కు తోడు కావడం పరిస్థితిని మరింత క్లిష్టంగా మారుస్తున్నది.

మరొకప్రక్క తెలంగాణ రాజకీయం పూర్తిగా కుల ప్రాతిపదికకు మారుతున్నది. కెసిఆర్ అంటే రెడ్డి నేతలెవరికీ సరిపడదు. వారి దృష్టిలో కెసిఆర్ ఒక దొర. ఆ దొర పెత్తనం వారికి గిట్టదు. దానితో కోమటిరెడ్డి వెంకటరెడ్డి వంటివారు అన్ని పార్టీల లోని రెడ్డి నేతలను ఒకటి చేయడానికి విపరీతంగా ప్రయత్నం చేస్తున్నారు. తెలంగాణలోని చాలా ప్రాం తాలలో రెడ్డి కులానికి రాజకీయ ఆధిపత్యం వుంది. దాన్ని జగన్ తనకు అనుకూలంగా మలచుకొంటు న్నాడు. ఇది చాలక తెలంగాణ ప్రాంతంలోని క్రైస్తవ మతస్తులు కూడా గంప గుత్తగా జగన్‌కు ఓట్లు వేసే పరిస్థితి కన్పిస్తున్నది. మహబూబ్‌నగర్‌లో పాదయాత్ర చేస్తున్న షర్మిళ సభలకు ఆయా ప్రాంతాలలోని చర్చి పాస్టర్లు వేలం వెర్రిగా వస్తున్నారు. వేదిక ఎక్కి ఆశీ ర్వాదం ఇచ్చి వెళ్తున్నారు.

జగన్‌కు అనుకూలంగా మారుతున్న ఈ కులాల ధాటిని తట్టుకోవాలంటే బిసిలను ముగ్గు లోకి దింపడం ఒక్కటే మార్గమని భావిస్తున్నాడు కెసిఆర్. ఆ వర్గానికి రాజకీయ ఆధిపత్యం లేకపో యినా సంఖ్యా బలం వుంది. దానికి తన రాజకీయ చతురత జమ చేసి జగన్‌ను పది పన్నెండు సీట్ల స్థాయికి పరిమితం చేయాలన్నది వ్యూహం. నల్గొండ రాజకీయవాదులను కోమటిరెడ్డి వెంకటరెడ్డి వైఎస్ఆర్ కాంగ్రెస్‌లో చేర్పించిన వెంటనే నల్గొం డలో భారీ సభకు సిద్ధం కావడం అందుకోసమే. నల్గొండ సభ కెసిఆర్ ఆశించినదానికన్నా అధికంగా విజయవంతమైంది.

జగన్ మీద ఎన్నో ఏళ్లుగా అవినీతి ఆరోప ణలు వస్తున్నా, ఎంతో పెద్ద వివాదం నడుస్తున్నా ఏరోజూ దానిలో వేలుపెట్టలేదు. తన సమస్య తెలం గాణే తప్ప జగన్ అవినీతి కాదన్నట్లు వుండిపోయాడు. కానీ నల్గొండ సభలో ఒక్కసారిగా జగన్ కుటుంబ అవినీతిపై విరుచుకపడ్డాడు. సహజంగానే ఆయన వాగ్దాటి జనాన్ని ఆకట్టుకొనే తీరులో వుంటుంది. జగన్‌తో పాటు తనను కూడా అవినీతిలో భాగస్వా మిని చేసి, బయ్యారం ఇనుప ఖనిజం గనులు తనకు కట్నంగా ఇచ్చాడని కెసిఆర్ ఆరోపించడంతో, పాద యాత్రలో వున్న షర్మిళ ఘాటుగా ప్రతి సమాధానం ఇచ్చారు. తనకు, ఆ గనులకు సంబంధం లేదని నిరూపిస్తే కాళ్లుపట్టుకొని క్షమాపణ కోరుతావా అని సవాల్ విసిరింది. ఆ మాటను టీవీ ఛానళ్లు పెద్ద వివాదంగా మలచి, నారద పాత్ర పోషిస్తున్నాయి. తెలంగాణ ఆత్మగౌరవాన్ని ఆ మాటకు జత చేస్తు న్నారు టిఆర్ఎస్ నేతలు.

మొత్తం మీద తెలంగాణలో సం'కుల' సమ రం ప్రారంభమైంది. దీని పరిణామాలు ఎట్లా వుం టాయో వేచి చూడాలి.

## కేజ్రీవాల్ పగటి కలలు

9వ పేజీ కొరవ

నకు తెలియదు. వారితో ఎట్లా మెలగాలో కూడా తెలియదు. కానీ ఆయనొక రాజకీయ పార్టీ స్థాపిం చాడు. తనది కాంగ్రెస్, బిజెపిలతో సమానమైన, వాటికి పోటీ ఇచ్చే పార్టీ అని ప్రచారం చేసుకొం టున్నాడు. ఆయన పార్టీ పేరు – ఆమ్ ఆద్మీ. అంటే సగటు మనుషులని అర్థం.

### టీవీ ఛానళ్ల ప్రచారం

కేజ్రీవాల్ ఆ భ్రమలో మునగడానికి కారణం – టీవీ ఛానళ్లు. అన్నా హజారే పక్కన నిలబడి, జన్ లోక్‌పాల్ బిల్లు ఉద్యమంలో పాల్గొన్న కేజ్రీవాల్‌కు టీవీ ఛానళ్లు ఎక్కడలేని ప్రచారం ఇచ్చాయి. అది చూసి మురిసిపోయాడు పాపం పిచ్చివాడు. టీవీ లలో కనపడితే ప్రజలకు పరిచయం అయిపోయి నట్లే భావిస్తున్నాడు. అందువల్లనే అన్నా హజారే వద్దన్నా విన్పించుకోకుండా స్వంత రాజకీయ పార్టీ పెట్టాడు. ఆయన తీరు చూస్తుంటే, జనం ఒక వరద వలె వచ్చి, తనకు ఓట్లు వేసి, ప్రధానమంత్రి కుర్చీలో కూర్చోబెడతారనే నమ్మకం వున్నట్లుంది.

ఇటువంటి పిచ్చివాళ్లు, వెర్రి వాళ్ల గురించి పత్రికలో వ్రాయడం, దాన్ని పాఠకులు చదవడం కూడా దండగ అనే నిజం ఈ విలేకరికీ తెలుసు. కానీ టీవీ ఛానళ్ల పుణ్యమా అని మధ్యతరగతి వర్గా లలో చర్చకు వస్తుండబట్టి, ఈ ప్రస్తావన చేయ వలసి వస్తున్నది.

### అవినీతిపై అవగాహన లేదు

అవినీతి అనే ఒకే ఒక అంశం మీద ప్రజలను కూడగట్టి అధికారంలోకి రావాలన్నది కేజ్రీవాల్ ఉద్దేశం. అయితే ఆ అవినీతిపై కూడా ఆయనకు సరైన అవగాహన లేదు. కేంద్ర ప్రభుత్వం కుట్ర పూరితంగా వస్తువుల ధరలు పెంచి, పారిశ్రామికు లకు అధిక లాభాలు కల్గిస్తున్నదన్నది ఆయన ప్రధాన ఆరోపణ. ప్రజలను వేధిస్తున్న ధరల సమస్య బియ్యం, గోధుమలు, కూరగాయలు, ఉప్పుపప్పులు, పాలు, ఎరగడ్డలు వంటి వాటికి సంబంధించినది. వీటిలో ఏ ఒక్కదాన్నీ పరిశ్రమలు ఉత్పత్తి చేయవు. బియ్యం చెట్లకు పండుతాయనే నగరవాసుల అమాయ కత్వం కేజ్రీవాల్‌లో కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నది. వీటి ధరలను తన ప్రభుత్వంలో ప్రజలే నిర్ణయిస్తారని ప్రకటిస్తున్నాడు కేజ్రీవాల్. ప్రజలకు ఏ కోణంలో వస్తువుల ధరల నిర్ణయంలో పాత్ర కల్పించేది ఆయన చెప్పలేదు. చెప్పలేడు కూడా.

### భ్రమల్లో బతుకుతున్నాడు

తనను తాను ఒక జయప్రకాష్ నారాయణ్ వంటి వాడినని, 1970 దశకంలో ఆయన చేపట్టిన సంపూర్ణ విప్లవం వంటి ఉద్యమాన్ని తాను ప్రేరే పించగలనని భ్రమ పడుతున్నాడు కేజ్రీవాల్. ఎక్కడి జయప్రకాష్ నారాయణ్? ఎక్కడి కేజ్రీవాల్. ఇద్దరి మధ్య నక్కకు నాగలోకానికి వున్నంత తేడా వుంది. స్వాతంత్ర్య ఉద్యమంలో విప్లవకారుడిగా బ్రిటీష్ దొరల గుండెలలో నిద్రపోయి, ఆ తర్వాత పార్టీ రాజకీయాల మీద విరక్తితో సర్వోదయ ఉద్యమం చేపట్టి, మూడు దశాబ్దాలపాటు ప్రజలతో మమే కమై, ఆ తర్వాత ఇందిరమ్మ ప్రభుత్వం మీద యుద్ధం ప్రకటించిన వారు జయప్రకాష్‌నారాయణ్. ఆయన స్థాయి, వ్యక్తిత్వం, ప్రజాదరణ వల్ల ఆ ఆందోళనకు యావత్ భారత ప్రజానీకం, మరీ ముఖ్యంగా యువతరం ఆకర్షితమైంది. మొరార్జీ దేశాయి, చరణ్ సింగ్, జార్జి ఫెర్నాండెజ్, వాజ్ పాయి, అద్వానీ, జగజ్జీవన్‌రాం వంటి మేరునగధీ రులు ఆయన అనుచరులుగా ఆ ఆందోళనలో జత కలిశారు. జైళ్లకు వెళ్లారు. నిర్బంధాలు ఎదుర్కొ న్నారు. ప్రభుత్వం మీద ప్రజల తిరుగుబాటును ప్రేరేపించారు. అయితే ఆ తిరుగుబాటుతో సమ స్యలు తీరవని ఆనాడే చెప్పాడు జయప్రకాష్ నారా యణ్. తన సంపూర్ణ విప్లవ లక్ష్యం మొత్తం సమా జంలో మార్పు రావాలన్నదే తప్ప ప్రభుత్వాలను కూలగొట్టడం కాదని ప్రకటించాడు జెపి. కానీ కేజ్రీ వాల్ తన అవినీతి వ్యతిరేక పోరాటానికి ప్రజలు ఆకర్షితులై ప్రభుత్వాన్ని పడగొట్టి, తనను ప్రధానిని చేస్తారని భావిస్తున్నాడు. ఇటువంటి పిచ్చివాళ్లు పెట్టే పార్టీలు ఎన్నికల కురుక్షేత్రంలో ఒక్కరోజు నిలవలేవు. కోడెల కుమ్ములాటలో లేగ దూడల కాళ్లు విరిగే అనుభవం ఆయనకూ ఎదురుకాక తప్పదు.

భిన్న జాతులు, మతాలు, కులాలు, తెగలు, వర్గాలు, సంస్కృతులతో సమ్మిళితమైన భారత దేశంలో ఎన్నికలకు అవినీతి వంటి భావన పరమైన అంశం ఒక్కటే ఆధారం కాజాలదు. మూర్తీభవించిన అవినీతి స్వరూపంగా ముద్రపడిన వైఎస్ జగన్‌ను ప్రజలు ఎట్లా ఆరాధిస్తున్నారో చూసిన తర్వాత కూడా ఆయనకు జ్ఞానోదయం కాకపోవడం ఆయనలోని భావ దారిద్ర్యానికి నిదర్శనం. ఒక్క జగనే కాదు, మాయావతి, జయలలిత, లల్లూప్రసాద్ యాదవ్ వంటి వారంతా అవినీతికి మారుపేరుగా ముద్ర పడిన వారే. కానీ అదే నేతలను నెత్తిన పెట్టుకొని పూజిస్తున్నారు జనం. దాని అర్థం ప్రజలు అవి నీతిని సహిస్తున్నారని కాదు. అవినీతి కంటే ముఖ్య మైన అంశాలు వారి జీవితాలను ప్రభావితం చేయ డమే అందుకు కారణం. ఆ సూక్ష్మాన్ని గ్రహించ కుండా ఏకంగా ప్రధాని పదవి దక్కాలని కలలు కనడం, దాన్ని జాతీయ మీడియా, టీవీ ఛానళ్లు గొప్పగా ప్రచారం చేయడం, కేజ్రీవాల్ నోట వచ్చే ప్రతి మాటా జాతీయ వార్తగా ప్రచారం కావడం నవ్వొచ్చే విషయం. కేజ్రీవాల్‌కే కాదు, మన జాతీయ మీడియాను కూడా భావ దారిద్ర్యం పట్టి పీడిస్తున్న దని దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

## వివేకా క్షేమం

మొదటి పేజీ కొరవ

వుంది. ఇక శస్త్ర చికిత్స అంటే ఎంత కలవరమో చెప్పనవసరం లేదు. అందువల్ల ఆపరేషన్ లేకుండా వైద్యప్రక్రియలు అవలంభిస్తూ వస్తున్నాడు. మోకాలు నొప్పి మరీ అధికం కావడంతో డాక్టర్ల సలహా మీద ఆస్పత్రిలో చేరి, విశ్రాంతి తీసుకొంటున్నారు. నగ రంలో ప్రచారం జరుగుతున్నట్లు ఆయనకు ఇప్పటి వరకు ఎటువంటి ఆపరేషన్ జరగలేదు. అనా రోగ్యం తీవ్రమూ కాలేదు. ముందు జాగ్రత్త కోసమే ఆస్పత్రిలో చేరాడని తెలుస్తున్నది. రొట్టెల పండుగ అంటే వివేకాకు ఎక్కడ లేని సరదా. ఆ మూడు రోజులూ అక్కడే మకాం పెట్టి, అంతా తానే అయి పెత్తనం చేస్తూ వుంటాడు. పదిహేనేళ్లకుపైగా కొన సాగుతున్న ఈ అలవాటుకు ఈ ఏడాది ఆటంకం కల్గింది. కాలు కదపలేని పరిస్థితి కావడంతో రొట్టెల పండుగకు హాజరు కాలేదు. దానితో ఆయన ఆరో గ్యం మీద పలురకాల వదంతులు ప్రచారమైనాయి. ఒకటి రెండు టీవీ ఛానళ్లు వివేకా తీవ్ర అస్వస్థతకు లోనైనట్లు బ్రేకింగ్ న్యూస్‌లు ఇచ్చాయి. అయితే అదంతా ఉత్తుత్తి ప్రచారం మాత్రమే. వివేకా క్షేమంగా వున్నాడు. కేవలం విశ్రాంతి కోసం మాత్రమే ఆస్ప త్రిలో చేరాడు తప్ప ఆందోళన చెందవలసిన అవస రం ఏమీ లేదు. ఆయన త్వరగా కోలుకొని, సంపూర్ణ ఆరోగ్యంతో తిరిగి రావాలని భగవంతుడిని ప్రార్థిస్తు న్నాము.

## జగన్‌తో కాంగ్రెస్ రాజీ?

మొదటి పేజీ కొరవ

సుప్రీంకోర్టు కఠినంగా వ్యవహరించడంతో ఆ ప్రయ త్నం రసాభాస అయ్యింది. ఇప్పుడు మరొకసారి, క్రింది కోర్టులలో అదే ప్రయత్నం చేయాలని ఆలో చిస్తున్నట్లు చెప్తున్నారు. బెయిల్ పిటిషన్‌ను తమ న్యాయవాదులు వ్యతిరేకించకుండా వదలి వేస్తే బెయిల్ రావచ్చుననే కోణంలో ఈ ప్రయత్నం వుం దట. ఈ సమయంలో బెయిల్ ఇప్పిస్తే జగన్ ఎంతో కొంత కృతజ్ఞత చూపుతాడని, ఎటూ ఆయనకే రాష్ట్రంలో అధికభాగం ఎమ్పీలు దక్కుతారు కాబట్టి, కేంద్రంలో తమకు మద్దతు ఇస్తాడని ఆశ పడు తున్నారట కాంగ్రెస్ పెద్దలు.

## పదరంగం -44

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | 3 | | 4 | 5 | | 6 | 7 |
| | | | 8 | | | 9 | | | 10 | |
| | | 11 | | | 12 | | | | 13 | |
| | 14 | | | 15 | | | | | | |
| 16 | | | | | | | | | 17 | 18 |
| 19 | | | 20 | | 21 | 22 | | 23 | | |
| | 24 | 25 | | | 26 | | | | | |
| 27 | | | | 28 | | | 29 | | 30 | |
| | | 31 | | | | 32 | | | | |
| 33 | 34 | | | 35 | 36 | | | 37 | | |
| 38 | | | | 39 | | | | 40 | | |

**అడ్డం**

1. శుభం కల్గుగాక అని దీవించడం (5)
4. శోభను కల్గించునది (5)
8. అటునుంచి నేల (2)
9. అటునుంచి సంహారం (2)
10. ముసలితనం (2)
11. ఖనిజం లభించే చోటు, గని (2)
12. ఆజ్ఞ (3)
13. అటునుంచి తెలుగు వర్క్ (2)
15. రెండ్డైదులు (2)
16. దొంగ (3)
17. అటునుంచి ఆడ కాదు! (2)
19. అటునుంచి నీరు (2)
20. 'నారి' కలిగిన కొబ్బరికాయ (4)
23. ఉద్యానవనం (3)
24. వ్యా వృత్తి (3)
26. పశువుల ఆహారం (2)
28. రోజు (2)
29. ట్రెజరీ (4)
31. పుప్పొడి (3)
32. రాత్రిళ్ళు వెలిగించేది (2)
33. వదంతి తడబడింది (3)
35. తృప్తి (3)
37. పిల్లనిచ్చినవాడు (2)
38. సరస్సు (3)
39. త్రినేత్రుడు (3)
40. తెలుగు జనరేషన్ (3)

**నిలువు**

1. పెద్దవారిని, గురువులను సేవించడం (3)
2. రాత్రి, చీకటి, రజని (3)
3. క్రింద నుంచి భూతం, రాం గోపాల్‌వర్మ సినిమా (2)
4. శోధించడం (3)
5. పూజ్యురాలు, ...భిక్షాందేహి! (3)
6. నిలువు రెండే (3)
7. క్రింద నుంచి ఇహమునకు వ్యతిరేకం, పరలోకం (3)
12. మొదలు, అందమునకు వ్యతిరేకం (2)
14. వ్యాపారం చేసేవారు క్రింద నుంచి వస్తున్నారు (4)
16. వింత (2)
17. భీముని ఆయుధం (2)
18. మీరు-మేమూ, అందరం (4)
20. స్వర్గలోకం (2)
21. జెండా, పతాకం (3)
22. క్రింద నుంచి మంగలి వాద్యం (2)
23. క్రింద నుంచి రూలు, చట్టం (3)
25. ఇతరులకు మేలు చెయ్యడం (5)
27. క్రింద నుంచే సంసారం, నివాసం (4)
28. దిక్కుల చివర (4)
29. కోపదారికి ఏం ఉంటుంది (2)
30. విండ్ మిల్ (4)
32. కరదీపిక (3)
34. క్రింద నుంచి 'సర్' మరోవిధంగా (2)
36. నిజం (2)
37. అమ్మ, తల్లి (2)

**సమాధానాలు**

## పదరంగం -43

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1వే | కు | 2వ | | 3ఆ | ట | 4వి | డు | 5పు | | 6వి |
| స | | 7స | లి | లం | | రా | | క | | ప |
| 8వి | 9కృ | తి | | బ | | మం | | 10కిం | 11చి | త్తు |
| | త | | 12ధ | న | 13ము | | 14వె | త | లు | |
| 15మె | కం | | ర | | కా | | ట్టి | | 16క | 17వి |
| రు | | 18ప | | 19త | బ | లా | | | | డ |
| 20పు | న | ర్వ | 21సు | | లా | | | | | అ |
| | | 22ము | ల | వా | | 23కా | 24లం | | 25గు | |
| 26మా | 27వ | | భం | | | | క | | 28మ్మ | 29బొ |
| 30త | ల | పు | | 31తా | 32పి | | | 33ఓ | ట | మి |
| 34రం | పు | | 35ఎ | లు | క | | 36శి | లి | ము | క |

# సంక్షిప్త సింహపురి

## లయన్స్ క్లబ్ యువ నిర్మాణ్!




లయన్స్ క్లబ్ ఆఫ్ నెల్లూరు చంద్రమౌళి నగర్ లోని మైథిలీ స్కూల్‌లో యువ నిర్మాణ్ ప్రతిజ్ఞా కార్యక్రమాన్ని నిర్వహించింది. ఈ సందర్భంగా లయన్స్ క్లబ్ జిల్లా వైస్ గవర్నర్ అమృతవల్లి మాట్లాడుతూ మనదేశంలో 60 శాతం మంది యువతీయువకులున్నారని, ఇది ఏ దేశానికి దొరకని అరుదైన సంపదని, అందుకే యువతలో నిబద్ధతను పెంచి ఆరోగ్యవంతమైన సమాజాన్ని నిర్మించేదానికి ప్రపంచంలోనే అత్యంత పెద్ద సేవా సంస్థ అయిన లయన్స్ క్లబ్ నడుం బిగించిందన్నారు. ఈ సందర్భంగా ఆమె విద్యార్థులందరిచేత యువ నిర్మాణ్ ప్రతిజ్ఞను చేయించారు. ఈ కార్యక్రమంలో లయన్స్ క్లబ్ మాజీ గవర్నర్ శ్రీనివాసరావు, క్లబ్ అధ్యక్షులు లక్ష్మీనారాయణ, కార్యదర్శి ఎం.శ్రీధరరావు, కోశాధికారి మోహన్ రాజ్, మైథిలీ స్కూల్ కరస్పాండెంట్ మైథిలీ మనోహర్‌రెడ్డి పాల్గొన్నారు.

## కళాకారునికి ఆర్థిక సాయం!



నెల్లూరులోని కేతా అంకుల్ మెమోరియల్ ట్రస్ట్ ఆధ్వర్యంలో పెద్ద పోస్టాఫీసు వద్ద సభ జరిగింది. ఈ సభలో అనారోగ్యంతో బాధపడుతున్న పేద కళాకారుడు దుర్గం వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రికి ట్రస్ట్ తరపున రెండువేల రూపాయల ఆర్థిక సహాయాన్ని కేతా సుబ్బారావు అందించారు. ఈ కార్యక్రమంలో బి.వి.నరసింహం, శింగంశెట్టి మురళీ మోహన్‌రావు, ఇంజనీరు సీతారామస్వామి తదితరులు పాల్గొన్నారు.

## చంద్రారెడ్డి విద్యాసంస్థల సాయం!



తెల్లకామెర్ల వ్యాధితో బాధపడుతున్న విద్యానగర్ ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కాలేజీ విద్యార్థిని ప్రీతి శస్త్ర చికిత్స నిమిత్తం నెల్లూరు చంద్రారెడ్డి విద్యాసంస్థల విద్యార్థులు 22 వేల రూపాయల విరాళాన్ని సేకరించి తమ కాలేజి కరస్పాండెంట్ కోటంరెడ్డి ప్రతాప్‌రెడ్డి ద్వారా ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ విద్యార్థులకు అందజేశారు. ఈ సందర్భంగా ప్రతాప్‌రెడ్డి మాట్లాడుతూ ప్రీతి త్వరగా కోలుకోవాలని కోరుతూ విరాళాలు సేకరించిన విద్యార్థులను ప్రశంసించారు.

## కాంగ్రెస్ సభ్యత్వ నమోదులో సివి!



పిసిసి మాజీ ఉపాధ్యక్షుడు, సర్వేపల్లి మాజీ ఎమ్మెల్యే సివి.శేషారెడ్డి ప్రకాశం జిల్లా కాంగ్రెస్ పార్టీ సభ్యత్వ నమోదు పరిశీలకుడిగా నియమితులయ్యారు. ఈ సందర్భంగా ఆయన నేతృత్వంలో పార్టీ సభ్యత్వ నమోదు కార్యక్రమం ఒంగోలు కాంగ్రెస్ పార్టీ కార్యాలయంలో సజావుగా జరిగింది. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ నీతివంతమైన పాలన కాంగ్రెస్‌కే సాధ్యమన్నారు. కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ కాంగ్రెస్ ప్రభుత్వాలు ప్రజాసంక్షేమం పరమావధిగా పని చేస్తున్నాయన్నారు. కాంగ్రెస్ ప్రభుత్వాలు పేదల అభ్యున్నతికి ఎన్నో పథకాలు ప్రవేశపెట్టాయని, వాటిని ప్రజలకు తెలియజేసి వచ్చే ఎన్నికల్లో రాహుల్ గాంధీని ప్రధానమంత్రిని చేసేందుకు కాంగ్రెస్ పార్టీ కార్యకర్తలు కంకణబద్ధులు కావాలని పిలుపునిచ్చారు. స్వర్గీయ ఇందిరాగాంధీ దేశంలో ప్రవేశపెట్టిన విప్లవాత్మక సంస్కరణలను పార్టీ కార్యకర్తలకు వివ రించారాయన. ఈ కార్యక్రమంలో ప్రకాశం జిల్లా డిసిసి అధ్యక్షుడు పోతుల రామారావు కూడా పాల్గొన్నారు. చాలా రోజుల తర్వాత సివి.శేషారెడ్డికి కాంగ్రెస్ పార్టీ ఇచ్చిన బాధ్యతను సక్రమంగా నిర్వహించి పార్టీలో సీనియర్లు సీనియర్లేనని చాటి చెప్పారు.

## గాదిరాజు సుబ్రహ్మణ్యం సంతాపసభ




సుప్రసిద్ధ సాహితీవేత్త, విద్యానగర్ ఎన్‌బికెఆర్ కళాశాలలో ప్రధానాచార్యులుగా బాధ్యతలు సమర్ధవంతంగా నిర్వహించిన డాక్టర్ గాదిరాజు సుబ్రహ్మణ్యం ఇటీవల మరణించారు. ఆయన సంతాప సభ రేబాల లక్ష్మీనరసారెడ్డి స్మారక భవనంలో మోపూరు వేణుగోపాలయ్య అధ్యక్షతన జరిగింది. పద్యకళా పరిషత్ అధ్యక్షుడు గాదిరాజు సుబ్రహ్మణ్యం సహాధ్యాయి ఎం.ఆర్.ప్రసాద్ మాట్లాడుతూ గాదిరాజు సాహితీవేత్తగానే కాకుండా వ్యాకరణంలోనూ దిట్టన్నారు. బి.వి.నరసింహం సంతాప తీర్మానాన్ని ప్రవేశపెట్టి వారి కుటుంబ సభ్యులకు అందజేశారు. గాదిరాజు సుబ్రహ్మణ్యం కుమార్తె అన్నపూర్ణ, కుమారుడు ప్రసాద్ తమ తండ్రిగారి పేరిట ప్రతి ఏడాది పద్యకళాపరిషత్ నేతృత్వంలో ఓ సాహిత్య సభ నిర్వహిస్తామని వాగ్దానం చేశారు.



రైతు లోకం

# వరిలో ఆకుముడత - నివారణ!

ప్రస్తుతం మన జిల్లాలో వరి పైరు నారుమడి దశ నుంచి పిలకలు కట్టే దశ వరకు వున్నది. దీనిలో ప్రధానంగా ఆకు ముడత పురుగు ఆశించి వున్నది. ఈ పురుగు సీతాకోక చిలుకలు పసుపు పచ్చ గోధుమ రంగులో వుండి రెక్కల అంచుల వద్ద ముదురు గోధుమ రంగులో సన్నని గీతలు కలిగి వుంటాయి. తల్లి పురుగులు ఆకులపైన గ్రుడ్డను ఒక్కొక్కటిగా, విడిగా పెడతాయి. గ్రుడ్లు తెలుపుతో కూడిన పసుపు రంగులో వుంటాయి. లార్వాలు ఆకుల అంచులను కలిపి గొట్టాలుగా / ముడతగా చేసుకొని లోపల వుండి పత్రహరితాన్ని గోకి తింటాయి. అందువల్ల ఆకులు తెల్లగా ఎండిపోయినట్లుగా కన్పిస్తాయి. తీవ్రంగా ఆశించిన పైరు నాము లాగా తెల్లగా కన్పిస్తుంది. పోటాకు దశలో పంటకు తీవ్ర నష్టం జరుగుతుంది. దీని నివారణకుగాను పిలక దశలో తాడుతో చేనుకు అడ్డంగా 2-3సార్లు లాగితే పురుగులు క్రింద పడిపోతాయి. పొలంలో దుబ్బుకు 2-3 పురుగులు ఆశించిన ఆకులు కనిపించిన వెంటనే నివారణ చర్యలు చేపట్టాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

**నివారణ చర్యలు:** క్లోరిపైరిఫాస్ 2.5మిల్లీ లీటర్లు లేక అసిఫేట్ 1.5గ్రాములు లేక కార్టాప్ హైడ్రో క్లోరైడ్ రెండు గ్రాములు లీటరునీటికి చొప్పున



కలిపి పిచికారీ చేయాలి. గుళికలు వేయాలంటే కార్టాప్‌హైడ్రోక్లోరైడ్ 4జి గుళికలు ఎకరానికి 8 కిలోల చొప్పున వేయాలి. పురుగు ఉధృతి ఎక్కువగా వుంటే రైనాక్సిఫిర్ 0.3మిల్లీలీటర్లు లేదా ఫ్లూబెండియమైడ్ 0.1మిల్లీలీటరు లీటరు నీటికి చొప్పున కలిపి పిచికారీ చేయాలి. J

Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/12-14



# ఉత్తరక్రియలు

ఉత్తమ సంస్కారి, నీతి నిజాయితీకి చిరునామా, మా ఇంటి దైవం
**శ్రీ పులిమి సుధాకర్‌రెడ్డి గారు** తేది 24-11-2012 శనివారం నాడు
స్వర్గస్తులైనారు. వారి ఆత్మకు శాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

**ఉత్తరక్రియలు : తేది 06-12-2012 గురువారం పెద్దకర్మ.**
నెల్లూరు చిల్డ్రన్స్ పార్కు దగ్గర ఆదిత్యనగర్‌లోని మా స్వగృహమునందు జరుగును.
కావున బంధుమిత్రులకు తెలియజేయడమైనది. సెల్ : 98856 45630

అశ్రునయనాలతో...
భార్య : పులిమి సునీత(పుష్ప)
కుమారుడు - కోడలు : పులిమి లాజ్‌వంత్‌రెడ్డి - శిల్పారెడ్డి
తమ్ముడు - మరదలు : పులిమి రత్నాకర్ రెడ్డి - పులిమి శైలజారెడ్డి (మాజీ మేయర్, నెల్లూరు)
తమ్ముని కుమార్తెలు - అల్లుళ్లు : రిషీక రెడ్డి - భమవరపు రాకేష్‌రెడ్డి
రీతిక రెడ్డి - కాటంరెడ్డి శ్రీకర్‌రెడ్డి
చెల్లెలు - బావ : సుభాషిణి - లేట్ ఊరిమిండి వెంకటరామిరెడ్డి
మరియు మనుమలు - మనుమరాండ్రు - కుటుంబసభ్యులు



స్వర్గీయ పులిమి సుధాకర్‌రెడ్డి గారు MSc, MEd, M.Phil
Rtd. Principal, N.B.K.R Arts & Science College, Vidyanagar
Principal Sri Auditya Degree & P.G College, Nellore



# శ్రద్ధాంజలి

ప్రజాసేవలో ధన్యం మీ జీవితం..
ప్రజలు మరువరు మీ సేవలు...

## కీ॥శే॥ శ్రీ మాగుంట సుబ్బరామరెడ్డి గారు

ఒంగోలు పార్లమెంటు మాజీసభ్యులు

17వ వర్ధంతి సందర్భంగా వారి పవిత్రాత్మకు
శాంతి కలగాలని ప్రార్థిస్తూ..



కుటుంబ సభ్యులు
మరియు
బంధుమిత్రులు




**తేది: 1-12-2012, శనివారం ఉదయం 11గం॥లకు**
నెల్లూరు, రంగనాయకులపేటలోని శ్రీరాఘవ కళ్యాణమండపమునందు **అన్నదాన కార్యక్రమము** జరుగును.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com